# సోమేశ్వర క్షేత్ర మాహాత్మ్యం

## (మరియు చరిత్ర)



'పరిశోధక పంచానన'

## కపిలవాయి లింగమూర్తి

ప్రథమ ముద్రణ : బహుధాన్య మహాశివరాత్రి 1
ప్రతులు : 1,000

వెల : రూ. 20/-

ప్రతులు లభించు చోటు :
అధ్యక్షులు
శ్రీ లలితా సోమేశ్వరస్వామి దేవాలయం
సోమశిల గ్రామం, కొల్లాపురం మండలం, మహబూబ్‌నగర్ జిల్లా.

ముఖపత్ర రచన : శీలా వీర్రాజు

ఫోటోలు : 1. వి. గోపీనాథ్
గోపినాథ్ స్టూడియో
మెయిన్ రోడ్, నాగర్‌కర్నూలు.

2. కె. రమేశ్
లక్ష్మి స్టూ
న్యూ బస్‌స్టే

ప్రూఫ్ రీడింగ్ :
మద్దూరి శ్రీకృష్ణశాస్త్రి
E.W.S - 17, బి.కె. గూడ
యస్. ఆర్. నగర్, హైదరాబాద్ - 38.

గ్రాఫిక్స్:
యస్. రాజేందర్, ఏ. చంద్రమోహన్
ఇన్‌స్టంట్ గ్రాఫిక్స్, స్ట్రీట్ నెం. 10, హిమాయత్ నగర్
హైదరాబాద్ - 500 029, ఫోన్ : 7645863

ముద్రణ :
స్క్రీన్ క్రియేషన్స్
'పింకి నివాస్', 3-4-663/7,
నారాయణగూడ, హైదరాబాద్ - 500 029



## సోమేశ్వరుడు

సోమశిల గ్రామం, కొల్లాపురం తాలూకా

# కృతజ్ఞతలు

నేనీరచనలో అభినవ కాళిదాస బిరుదాంచితులైన కీ.శే. శ్రీ తెలకపల్లె రామచంద్ర శాస్త్రిగారి హయగ్రీవ శతకం నుండి కృష్ణవేణీ స్తుతిని -

రాష్ట్ర పురావస్తుశాఖోద్యోగులైన శ్రీ బండారు సుబ్రహ్మణ్యం, ఈమని శివనాగిరెడ్డి గారల యొక్క ''చరిత్రలో సోమశిల దేవాలయాలు'' అనే వ్యాసాన్ని స్వీకరించినాను.

అంతేగాక యిక్కడి ప్రధాన దేవతలు శ్రీ లలితా సోమేశ్వరులు. శివస్తుతులెన్ని ఉన్నా నాకు సోమేశ్వర మకుటంతో ప్రాచీనమైన స్తుతియేది కనిపించకపోగా మిత్రులు శ్రీమాన్ నల్దీగ శ్రీనివాసాచార్యులను కోరగా వారు సరళమైన శైలిలో శ్రీ లలితా సోమేశ్వరసం స్తుతి రచించి యిచ్చినారు. ఇక లలితాదేవి స్తుతికి శ్రీ శంకరాచార్యుల లలితా పంచరత్నం స్వీకరించినాను.

ఈ క్షేత్రం సప్తనదీ సంగమం కనుక సప్తనదీస్తవం కూడ ఒకటి చేర్చితే మంచిదనే కోరికతో మిత్రులు శ్రీ వెల్దండ కామేశ్వరరావుగారిని కోరగా వారు సప్తనదీస్తవం కూర్చి యిచ్చినారు. అందువలన పై కవులందరికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాంజలు లర్పిస్తున్నాను.

పుస్తకాన్ని మామూలుగా ప్రచురించటం ఒక యెత్తు, దేశ పటాలతో, చిత్రాలతో ప్రచురించటం మరొక యెత్తు. అది మళ్లీ రచనా వ్యాసంగమంతటి పని. నాకు యిందులోని దేశపటాలు గీసి యిచ్చినవారు పాలెం నివాసి శ్రీ ఎస్. బాలకిష్టయ్యగారు (డ్రాయింగ్ మాస్టర్) దీనిలోని ఫోటోలు తీయించి యిచ్చినవారు శ్రీ ఎమ్. శేఖర్‌రెడ్డి, ఎమ్.డి. జహాంగీర్‌గారలు. దీన్ని అచ్చుకొరకు శుద్ధప్రతి చేసి యిచ్చినవారు శ్రీ పి. వీరయ్యగారు (విశ్రాంతి ఉపాధ్యాయుడు) సిటీలో ఉండి దీని ముద్రణా వ్యవహారాన్నంతా సొంత పనివలె చూచుకొన్నవాడు అభిమాన ఛాత్రుడు ఎమ్.డి. ఇమాముద్దీను. అచ్చులో దీనిలోని దోషాలన్ని నిర్దుష్టంగా దిద్దిన వారు శ్రీ కృష్ణమూర్తి గారు. కావున వీరందరిని ఆ లలితా సోమేశ్వరులు సర్వదా అనుగ్రహించవలెనని ప్రార్థిస్తున్నాను.

**వాణీ సదనం**
17-110, విద్యానగర్ కాలనీ
నాగర్ కర్నూలు - 509209
ఫోన్ : 08540-26437

ఇట్లు
సాహిత్యారధకుడు
**కపిలవాయి లింగమూర్తి**



దిక్పాలకులు, సోమశిల



ద్రవ్యదాత

శ్రీ జటిమోని (జటాబోయని) నరసయ్య దంపతులు

# ద్రవ్యదాత పరిచయం

నేను ఈ చరిత్రను క్రీ. శ. 1992లో రచించినాను. నాతో దీన్ని వ్రాయించినవాడు పోతరాజు పుల్లయ్య. రచన పూర్తికాగానే వెంటనే దీన్ని అచ్చులో తేవలెనని నాకంటే అతడే యెక్కువ ప్రయత్నం చేసి తాపత్రయపడినాడు కాని కాలం కలిసిరాలేదు.

ఈ లోపల ఈ సంవత్సరంలో నేనే దీన్ని స్వయంగా ముద్రించి సోమేశ్వరునికి సమర్పించుదామనుకున్నాను. ఈ కాలంలో అక్కడ స్వామివారికి శాశ్వత పూజలు చేయించే భక్తులు కూడ చేరసాగినారు. వారిలో శ్రీ జటమోని (జటాబోయని) నరసయ్యగారొకరు. ఆయన పూజలో చేరిన తర్వాత ఒకనాడు పుల్లయ్యగారు నా దగ్గరకు వచ్చి ఫలానా ఆయన నడిగితే మన ప్రయత్నం వృధాకాదు అన్నాడు. సరేనని యిద్దరం నరసయ్యగారింటికి వెళ్లగా ఆయన ఆనాడు లేడు. పుల్లయ్యతో సరేలే నేనే కలిసి పలకరించి చూస్తానని చెప్పి వీలు చూచుకొని ఒకనాడు నేనే వెళ్లి అతనిని కలిసి ఈ చరిత్ర విషయం ప్రస్తావించినాను.

ఆయన ఎంతవుతుంది అన్నాడు. నేను ''యింత కావచ్చు'' అని అంచనా చెప్పగా అయితే వేయించండి. మనకు క్షేత్ర చరిత్రలు చాలా తక్కువ గదా ! అన్నాడు. ఇట్లా నరసయ్యగారి వలె ఒకే ఒకమాటలో బదులు చెప్పకుండ సత్కార్యాలకు సహకరించేవారరుదు.

శ్రీనరసయ్యగారు మా తాలూకాలోని తాడూరునివాసి. ముతరాసి వంశానికి చెందినవాడు. జటమోని దేవమ్మ, నరసింహయ్య గారతని తల్లిదండ్రులు.

నరసయ్యగారు ప్రస్తుతం మా జిల్లాలోనే ఫారెస్ట్ రేంజ్ ఆఫీసర్ గా పని చేస్తున్నాడు. ఆయన పర్యవేక్షణలో మహబూబ్‌నగర్, హన్వాడ, ధన్వాడ, కోయలకొండ, దేవరకదర, నారాయణపేట, నవాబ్‌పేట, జడ్చర్ల, మక్తల్ మొదలైన ఇరువది మండలాలున్నవి. అటు కర్నాటక బార్డర్‌లోని శక్తినగర్ నుండి ఇటు మా జిల్లాలోని బాలానగర్ వరకుగల 66 వేల ఎకరాల పరిధిలో గల అరణ్య భాగమంతా ఆయన నిగ్రానిలో వర్ధిల్లుతుంది.

శ్రీనరసయ్యగారు సౌమ్యుడు, సహృదయుడు, ధర్మకార్య చింతనాపరుడు. తన దారిని తాను పని చేసుకుంటు వెళ్లే ఋజువర్తనుడు. Work is worship ఉద్యోగమే

ఉపాసన అనే లక్ష్యంతో పడకపై నుండి లేవగానే ''నమోవృషే
స్మరించుకుంటు ఏదిక్కు చూడకుండా తన కార్యస్థానానికి వె
ఆయనలోని ప్రత్యేకత.

నరసయ్యగారి శ్రీమతి తెలకపల్లె బొమ్మసాని లక
అలివేలమ్మగారు. ఆమె నరసింహునికి లక్ష్మీదేవి వంటిది. విభుని
మానినీ శిరోమణి. ఈ దంపతుల కిద్దరు కూతుళ్ళు, యిద్దరు క
కూతుళ్ళు వివాహాలై కాపురాలకు వెళ్ళిపోయినారు. కుమారులు చ

ఈయన యిపుడు నాగర్‌కర్నూలులోనే విద్యానగర్ కా
స్థిరపడినాడు. సరసులు సహృదయులైన ఈ దంపతులను వీరి కు
సోమేశ్వరులు సర్వకాల సర్వావస్థలయందు ఆరోగ్యభాగ్యాలిచ్చి క
ప్రార్థించుచున్నాను.

గ్రం

# ఆముఖం

సోమేశ్వరం కృష్ణా తీర్థ క్షేత్రం. ఇక్కడ కృష్ణాతీరంలో అగస్త్యేశ్వరం, కపిలేశ్వరం, సంగమేశ్వరం, సిద్ధేశ్వరం, సోమేశ్వరం అని పంచేశ్వరాలున్నవి. వానిలో కపిలేశ్వరం సంగమేశ్వరం, సిద్ధేశ్వరం కర్నూలు జిల్లాకు చెందగా, అగస్త్యేశ్వర సోమేశ్వరాలు రెండూ మాజిల్లాకు చెందుతున్నవి.

ఆవలివైపున గల వానిలో ఒక్క సంగమేశ్వరం మాత్రమే మహాక్షేత్రంగా ఉంది. ఆసముదాయంలో ఆరు ప్రధానమైన ఆలయాలు మరోరెండు యితరమైనవి గూడ ఉన్నవి. వానికి అనుబంధంగా రూపాల సంగమేశ్వరం పేరుతో మరో ఆలయం కూడా ఉంది.

ఇక మిగిలిన రెండు చిన్న చిన్నవే, ఇవతలి గట్టున ఉన్న అగస్త్యేశ్వర సోమేశ్వరాలు- రెండు పెద్ద సముదాయాలే. ఇపుడు అగస్త్యేశ్వరంలో పదహారు ఆలయాలు, సోమేశ్వరంలో పద్నాలుగాలయాలు ఉన్నవి.

పూర్వం అగస్త్యేశ్వరం - అగస్త్యేశ్వరం, మల్లేశ్వరం అని రెండు భాగాలుగా ఉన్నదట. ఆ సముదాయంలో కొన్ని ఆలయాలు నేలలో పూడి ఉండగా సుమారుగా అరువదేండ్ల నాడు ఎవరో ఒక సాధువు వచ్చి అక్కడ కొంతకాలం నివసించి నేలలో పూడిన గుడులను త్రవ్వి పైకి తీయించినాడని ఆ ప్రాంతపు వృద్ధులు చెప్పినారు.

నదీ తీరాలలో ఉన్న ఆలయాలు ఆ విధంగా నేలలో పూడిపోవటం లేదా నదీ కోతకు కూలిపోవటం మామూలే. మా జిల్లాలో దుందుభీ తీరం వెంట ఆవంచ దగ్గర రెండు రాజభవనాలు, సదగోడు దగ్గర ఈవైపున రెండు ఆలయాలు ఈ శతాబ్దంలోనే దాని గర్భంలో కలిసి పోయినట్లు చూచిన వారు చెప్పగా విన్నాను. అంతవరకింకెన్ని కలిసినవో మరి.

ఇపుడీ అగస్త్యేశ్వర సోమేశ్వరాలయ సముదాయాలను సురక్షిత ప్రాంతాలకు తరలించినారు. ఇవి చక్కగా నడుస్తున్న కాలంలో సోమేశ్వరమే వీనిలో కన్నాకుగా ఉన్నట్లు తక్కినవన్ని అర్చనాదికంలో దీన్నే అనుసరిస్తున్నట్లుగూడ వృద్ధులు చెప్పేవారు.

శ్రీశైలంలో పూర్వం రెండు పెద్ద భేరీలుండేవట. పూజావసరంలో వానిని మోగించేవారట. అటువంటి భేరీలు ప్రతాపగిరి సీమ అనగా అమరాబాదు పీఠభూమిలోని

చంద్రగుప్తిలో ఒకటి, ఉమామహేశ్వరంలో ఒకటి, దేవరకొండ ర
ఉండేవట. శ్రీశైలంలోని భేరీనినాదం విని చంద్రగుప్తి దాని నినాదం వి
అదివిని దేవరకొండ దుర్గంలోని భేరీలు మ్రోగింపబడుతూ అక్క
దాని సహాయంతో పూజానివేదనలు ఏక కాలంలో జరిగేవని వెనుక

అక్కన్న మాదన్న అనే మంత్రులు మహంకాళీ మహేశ్వరం
ఉమామహేశ్వర భక్తులు కనుక శ్రీశైలంలోని శివుని పూజా భేరి
వారని ఈ భేరీల మ్రోత అంతవరకు వరుసగా అందుతూపోయే
చెప్పేవారు.

ఇటువంటి భేరీమ్రోత పద్ధతి పూర్వం ఈ సోమేశ్వరంలో గ
నిదర్శనంగా నృసింహకోన సమీపంలోని గట్టు నిపుడు అక్కడివా
చెబుతారు.

1995లో నన్ను శ్రీ పోతరాజు పుల్లయ్యగారు తీసుకు వెళ్లి ప
చూపించినాడు. ఆ కాలంలో శ్రీశైలంలోని భేరీనినాదం విని సోమేశ్వర
పిమ్మటనే ఇక్కడి పంచేశ్వరాలన్నిటిలో ఏక కాలంలో పూజ
మయ్యేవట.

కాకతీయుల నాడిక్కడ ఒక గోళకీ మఠం గూడ ఉన్నట్లు
మఠం అంటే అది మరో రూపంలో విశ్వవిద్యాలయమే. అంతేగా
లేకత్రితమై వెలసిన ఈనాటి పుట్టపర్తి వంటి వ్యవస్థ. కాబట్టి అటు
ఈ సోమేశ్వరం ఆనాడు తక్కిన వాని నన్నిటివి వెనకేసుకొని నడిపిం
కాదు. కాని కాకతీయుల అనంతరం దేశం తురుష్కాక్రాంతమై హిం
కలి పురుషుని కాలిదెబ్బతిన్న ధేనువులైపోయి కాలగర్భంలో మరుగు
భూగర్భంలో తలదాచుకొన్నవి.

అటువంటి తరుణంలో మళ్లీ ఆ మల్లికార్జునుని అనుగ్రహమా
కృష్ణానదికి ఆనకట్ట కట్టడం కాలగర్భంలో మరుగుపడిన ఆల
సుదినమయింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇక్కడి శిల్పసంపదను ప
బూనుకొని వానిని సురక్షిత ప్రాంతాలకు తరలించింది. కాని ఈస
వారు అలాగే కృష్ణకే వదలినారట. అపుడా సోమేశురుడప్పటి పురా

కృష్ణశాస్త్రి గారికేం చెప్పినాడో ఆయన వచ్చి ఈ ఆలయ సముదాయాన్ని పరిశీలించి ఇవి కృష్ణాగర్భంలో కలిసి పోవటానికి వీల్లేదని మరో చోటికి తరలించవలెనన్నాడు.

అట్లా ఆసముదాయం తరలించే సంగతి వినగానే గ్రామానికి సర్పంచుగా ఉన్న పోతరాజు పుల్లయ్య మాస్వామి మా దగ్గరనే ఉండవలెకాని మరోచోటికి మేం వెళ్లనీయం అని గట్టిగా నిలిచినాడు. ఆయన వెనుక అపుడు గ్రామం కూడా నిలిచింది. అదిచూచి కృష్ణశాస్త్రిగారపుడు ఆ సోమశిల దగ్గరనే మరోస్థలం ఎన్నిక చేయించి ఆ సముదాయాన్ని అక్కడికి తరలింప చేసినాడు.

ఒకవేళ ఆనాడు ఈపుల్లయ్యగారే గట్టిగా నిలువకుంటె సంగమేశ్వరాలయం వలె ఈ సోమేశ్వరం మరే గట్టుకు తరలేదో చెప్పలేం.

అట్లా అవతలి వైపున సంగమేశ్వరాని కెవరూ గట్టిగా నిలువ లేదు కాబట్టి అది మట్టూ ఏజన సంచారం లేని జగన్నాధం గట్టెకింది.

కృష్ణశాస్త్రిగారు పుల్లయ్యగారి ఆవేదన నర్థం చేసికుని వారి దగ్గరనే నిలిపినాడు. అందుకాయనకు ఆగ్రామస్థులు ఎంతో కృతజ్ఞతలు చెప్పుకుంటూ ఉంటారు.

అక్కడ ఆలయాలు పూర్తికాగానే పుల్లయ్యగారిక వాని చరిత్ర కొరకై నాదగ్గరకు వచ్చినాడు. ఈవిషయంలో అతడు నాదగ్గరకు ఎన్ని తడవలు తిరిగినాడో చెప్పలేను. ఆయన వంటివాడు మండలానికి ఒకడుంటే చాలు; ఈనాడు మనగ్రామాలలోని శిథిలాలయాలు అట్లా ఉండక పోయేవి అంటె అబద్ధం కాదు. నేను వదిలినా ఆయన నన్ను వదిలేటట్లు కనిపించలేదు. కాని చరిత్ర వ్రాయటం అంటె విషయ మేదిలేకుండా వివరమేది తెలియకుండా వ్రాయలేం గదా ! అంతేకాక నేను చరిత్ర ఏది తలపెట్టినా ఏదో ఒక కోణంనుండి కొంతైనా ఈ జిల్లాను నలుగురికి తెలపటమేనా ఉద్దేశం కనుక ఇప్పటికి దీన్ని మీ ముందుంచుతున్నాను. ముందు ముందు ఈ క్షేత్రాన్ని గురించి యింకా ఏదైనా సమాచారం తెలిసివస్తే పునర్ముద్రణలో దీన్నింకా సమగ్రంగా మీ ముందుంచుతాను.

ఇట్లు
సాహిత్యారాధకుడు
**కపిలవాయి లింగమూర్తి**



సోమేశ్వరుని ఎదురుగా నంది, సోమః

# విషయ సూచిక

# సోమశిల మార్గం

సోమశిలకు వెళ్లదలచినవారు ఏ వైపు నుండి వచ్చినా మొదట కొల్లాపురం చేరవలసి ఉంటుంది. అక్కడి నుండి దినం మూడు వేళలా లోకల్ బస్సులు నడుస్తవి.

హైదరాబాదు నుండి కొల్లాపురంకు డైరెక్టుగా బస్సులున్నవి. కర్నూలు నుండి వచ్చే వారికి పెబ్బేరు నుండి డైరెక్టు బస్సులు దొరుకుతాయి. అక్కడి నుండి వీపనగండ్ల పై నుండి ఒక రూటు, వెల్లగొండ పై నుండి ఒక రూటు ఉన్నవి. ప్రస్తుతం వీపనగండ్ల రూటు అంత బాగాలేదు గాని వెల్లగొండ రూటులో సుఖంగా ప్రయాణం చేయవచ్చు. ఈ రూటులో చిన్నంబావి ఒక పెద్ద హాల్టు.

జిల్లాస్థాయిలో జిల్లానుండి, నాగర్ కర్నూలు నుండి నేరుగా కొల్లాపురం చేరటానికి బండ్లున్నవి. నాగర్ కర్నూలు నుండిగూడ కోడేరు, పెద్దకొత్తపల్లి అనే రెండు రూట్లలో బస్సులు నడుస్తవి. వానిలో పెద్దకొత్తపల్లి రూటులోనే బండ్లెక్కువ.

ఆంధ్ర ప్రాంతంవారు శ్రీశైలం మీదుగా కూడా సోమశిలకు రావచ్చు. శ్రీశైలం నుండి నేరుగా నాగర్ కర్నూలు, మహబూబునగర్ బస్సులుంటాయి. మహబూబునగర్ బండిలో వచ్చినపుడు నాగర్‌కర్నూలులో దిగి కొల్లాపురం బండి ఎక్కవలసి ఉంటుంది.

ఇక్కడ ఏటా ఆషాఢశుద్ధ ఏకాదశికి, కార్తిక పూర్ణిమకు, శివరాత్రికి ఉత్సవాలు నడుస్తవి. శివరాత్రి ఉత్సవం అయిదు దినాల జాతర. అపుడు శివ పార్వతుల కల్యాణం రథోత్సవం గూడ నడుస్తవి. ఈ ఉత్సవానికి వేలాది నుండి యాత్రికులు వచ్చి యిక్కడ పవిత్రమైన కృష్ణానదిలో స్నానం చేసి పునీతులౌతుంటారు. అపుడు రాత్రి వేళల్లో యిక్కడ హరి కథలు, నాటకాలు గూడ నడుస్తుంటాయి.

ఉత్సవదినాలలో కొల్లాపురం డిపోవారు అదనపు బస్సులు నడుపుతారు. ప్రైవేటు బండ్లుగూడ బాగానే ఉంటవి.

బస్సు మార్గాలకోసం యాత్రికుల సౌకర్యార్థం దీనిలో కొల్లాపురం మండల పటాన్ని యిచ్చినాను. దారులు గమనించండి.

# కృష్ణవేణీ స్తుతిః

(భుజంగ ప్రయాత)

– తెలకపల్లె రామచంద్రః



శ్లో॥ చలద్రంగ దుత్తుంగ భంగాభిరామాం
పథస్సంభవాం పశ్చిమాద్ర్యం తరస్థాత్ ।
సరన్తీం ధ్వనన్తీం యథాసామగానం
దధానాం పవిత్రాం భజేకృష్ణవేణీమ్ ॥

శ్లో॥ నమ ప్రాణినాం క్షుత్పిపాసోపశాన్తిం
విధాతుం వతీర్ణాం జగత్యాం పయోభిః ।
సమస్తాని నస్యాని మాతేవసాన్తీం
అమర్త్యాభి గమ్యాం భజేకృష్ణవేణీమ్ ॥

శ్లో॥ జయారంభ భేరీ ధ్వనిం సాగరంస్వం
ప్రియం నత్వరం సానురాగం వ్రజన్తీం ।
స్వమార్గాన్తర గ్రామ పల్లీర్గతాభిః
కృతస్నాన సంశుద్ధ హృద్భిస్సతీభిః ॥

శ్లో॥ హరిద్రాపరాగా క్షతైర్గన్ధ పుష్పైః
ఫలైర్నారి కేళైః కృతం భవ్యమర్ఘ్యం ।
గృహీత్వా విభాన్తీం భుజంగ ప్రయాతాం
ఖనిం మంగళానాం భజే కృష్ణవేణీమ్ ॥

శ్లో॥ లసచ్చారద వ్యోమ్ని తారాన్తరోత్థాం
సితాం పద్ధతిం వాల సన్తీం రసాయామ్ ।
మనీన్ద్రైపస్యా రతై స్సేవ్య మానాం
మహిమ్నాం నిధానం భజేకృష్ణవేణీమ్ ॥

శ్లో॥ క్వచిద్గం డశైలాధి రోహావరోహై:
స్ఖలన్తీం లుఠన్తీం క్వచిత్ప్రైకతేషు।
క్వచిత్క్ష్వాల మున్మూలయన్తీం సలీలం
స్వయానావరోధం భజే కృష్ణవేణీమ్॥

శ్లో॥ క్వచిన్నమ్న గర్తేషు చావర్తయన్తీం
క్వచిద్భూరుహా న్స్వైర ముత్పాటయన్తీం।
వినమ్రాన్క్వచిద్వేత సాన్పాలయన్తీం
సుధాప్పర్ధినీ రాం భజేకృష్ణవేణీమ్॥

శ్లో॥ మృదుప్రాశ్శీకరాం స్తీరగేష్వాకిరన్తీం
జనేష్వన్వహం సుప్రభాతానుకూలైః।
ప్రబోధం నయన్తీ మివహ్స్వైర్ని నాదైః
జగత్సర్వ మేతద్భజే కృష్ణవేణీమ్॥

శ్లో॥ క్వచిత్సఙ్గతాం తుఙ్గభద్రాముఖాభి
ర్ధునీభి ర్మహత్స్వాగతం సంవదద్భిః।
సఖీభిర్యథానన్త కల్లోల పూర్ణాం
నటన్తీం వదన్తీం భజేకృష్ణవేణీమ్॥

శ్లో॥ క్షణం దర్శనా త్స్పర్శనా న్మజ్జనాద్వా
మహాపాతకే భ్యో విముక్తింవ మర్త్యాన్।
నయన్తీం స్థిరాం తత్పత్యాన్మక్తి కాన్తాం
మనన్తీం సదాతాం భజే కృష్ణ వేణీమ్॥

శ్లో॥ సమభ్యాగతాభి స్వనంగా సురక్త్యా
సమాలింగితాం సర్వకుల్యాభి రమ్యామ్।
క్షమాం జంగమ స్థావర ప్రాణిరక్షా
విధౌ జ్ఞానధాత్రీం భజే కృష్ణవేణీమ్॥

# సప్త గంగాస్తవం

శ్రీ వెల్లండ

1. శ్రీశైలేశకృపాపూర్ణాం - పవిత్రామల తోయదాం
విధ్వస్తాఖిలపాపౌఘాం - కృష్ణవేణీం నమామ్యహం

2. శ్రీరాఘవేంద్ర సంసేవ్యాం - కర్ణాటాంధ్ర జనప్రియాం
నదీద్వయ సమాకీర్ణాం - తుంగభద్రానమోస్తుతే

3. శ్రీపాండురంగ తీర్థంత్వాం - చంద్రభాగేతివిశ్రుతాం
మహారాష్ట్ర ప్రియాందివ్యాం - భీమరథీం నమామ్యహం

4. రంగాయమునయో స్తుల్యాం - మాన్యాం మలాపహారిణీం
ఆయురారోగ్యదాం దేవీం - మలప్రభాంనమామ్యహం

5. కృష్ణాగోదావరీతుల్యాం - బ్రహ్మవిష్ణుశివాత్మకం
భక్తాభీష్ట ప్రదాంగంగాం - ఘటప్రభాం నమామ్యహం

6. కోటి జన్మకృతం పాపం - శ్రీఘ్ర మేనవినశ్యతి
యస్యాః సంస్పర్శమాత్రేణ - తాంనమామి కుముద్వతీం

7. సర్వసంపత్కరీం గంగాం - సర్వపాప ప్రణాశినీం
భవనాశీతి విఖ్యాతాం - భక్త్యాత్వాం ప్రణమామ్యహం

8. సప్తగంగా స్తవంపుణ్యం - రామేశ్వర వినిర్మితం
ప్రభాతే స్నానకాలేవా - పఠేద్భక్త్యా సుఖార్థినః

# శ్రీ లలితా సోమేశ్వర సంస్తుతిః

రచయితా శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యః

1 శ్రీ గాంగికా లలిత సుస్మిత చంద్రచూడం
దివ్యత్ఫణీంద్ర మణి భూషణ భూషితాంగం ।
సౌమ్యార్ధ దేహలలితా మదిరేక్షణా ఢ్యం
సోమేశ్వరం మహిత సోమశిలాధి వాసమ్ ॥

2 భస్మాంగరమ్య మనలోజ్జ్వల ఫాల భాగం
ఆనంద తాండవ మనన్య కళాస్వరూపం ।
స్థాణుం గిరీశ మహి భూషణ మష్టమూర్తిం
సౌ మీశ్వరంచ లలితా విభుసోమనాథమ్ ॥

3 భూజీవనాఽగ్ని మరుదంబర దివ్యరూపం
సూర్యేందు దివ్య జనయాజక కాలరూపం ।
యోగీశ్వరం రజిత దివ్యనగాధి వాసం
నౌమీప్రభుం లలిత సోమశిలాధి వాసమ్ ॥

4 నాగేంద్ర రత్న ఘటి తోరుజటా కలాపం
శృంగార వైభవ కళాకమనీయ నేత్రం ।
భాగీరధీ లలిత తుంగతరంగ రంగ
న్మౌళిం నమామి లలితా ధవసోమనాదమ్ ॥

5 శ్రీవిష్ణుపాదజల జోద్భవ గాంగి కోరు
ప్రాచుర్య శీకర తరంగ నట త్స్రవంతీ ।
సంభూషితోన్నత మనోజ్ఞ జటాకటాహం
నౌమి ప్రసన్న లలితా ధవ సోమనాథమ్ ॥

6 పాయాన్మాం లలితా హృదబ్జ మధుప శ్రీసోమ నాదేశ్వరః
దత్వాఽనంత విభూతి సౌఖ్య మనిశం
కైవల్య సంపత్ప్రదం ।
య త్సౌఖ్య ప్రద దివ్యనామ మననాత్
యత్కీర్తి సంకీర్త నాత్
యత్పాదద్వయ చింతనాత్ కలిభవో ధృతిర్వినష్టాభవేత్ ॥

7 ఇదం త్రిభువ నేడితం
శ్రీలహృదబ్జ సంపూజితం
దిగీంద్ర విబుధా దిభి
ర్వినుత భక్తకల్పద్రుమం ।
మదీయహృది సోమశే
ఖర మనోజ్ఞ పాదద్వయం
చకాస్తురహసి హ్రియా
లలితయా సదా చుంబితమ్ ॥

8 నమామి దేవీ లలితాధి నాయకం
దురంత దుఃఖాపహ నామరమ్యం ।
సురాప గోద్భాషిత మౌళిమీశం
సురేశ్వరం సోమశిలా మహేశ్వరమ్ ॥

9 జయతు జయితు దేవో సోమశైలాధినాధః
విజయతు లలితా శ్రీచిత్త సత్కైరవేందుః ।
జయతు జయతు గంగా స్మేర రమ్యోత్తమాంగ ః
విజయతు సద్భక్తాఽభీష్టదో సోమనాధః ॥

10 సోమశైలమహేశ । సల్లలితాననాంబుజ షట్పద ।
శ్రీగిరీశ్వర । భక్తమానస హంస । భవ్యకృపానిధే ।
పన్నగేంద్ర విభూష । దుర్భవరోగ నాశక ధీమణే ।
త్వాం ప్రణామ్య హమీశ । సల్లలితాంబికాధవ । పాహిమామ్ ।।

11 కాలకంధర । దీనసుందిర । కామిత ప్రద సద్గుణ ।
ఫాలలోచన । భావయామి తవాంఘ్రిమాత్మని సంతతం ।
సోమశేఖర । సోమభూధర సోమనాధ । దయానిధే ।
దేవదేవ । భవాబ్ధిమగ్న మధీంమీశ్వర । పశ్యమామ్ ॥

12 శ్రితజగత్పతిం - హితగుణాకృతిం
వితత వైభవం - విశ్వనాయకం ।
నిగమ సంస్తుతం - నిత్య సుందరం
సోమసుందరం - దేవమాశ్రయే ॥

13 సులలితా ధవం - శుభకరా కృతిం
శివ మనారతం - శ్రితజన ప్రియం ।
ఫణివిభూషణం - భక్తపోషణం
సోమసుందరం - దేవమాశ్రయే ॥

14 సదానందవర్తిం - చిదానందమూర్తిం
ఉమాచిత్త సౌందర్య సచ్చక్ర వర్తిం ।
జితా నంగ కీర్తిం - హ తారాతి ధూర్తం
శివం సోమ శైలాధి దేవం భజేఽహమ్ ॥

15 తకత్తైత తైతైత - తద్ధింత ధింతై
ర్త కత్తే, తి దీవ్యన్మహ త్తాండవోత్థైః ।
నటంతం గిరీశం పరేశం సురేశం
విభుం సోమశైలాధినాధం భజేఽహమ్ ॥

16 ఫలశ్రుతిః
లలితాశ్రీ సోమనాధస్య
స్తుతిమిత్థంచ యః పఠేత్
సోఽపి శ్రియంసమాప్నోతి
కైవల్య సుఖ సంతతిమ్



సోమేశ్వరుడు, సోమశిల



# శ్రీ లలితా పంచరత్నమ్

(శ్రీ శంకరాచార్యకృతం)

1 ప్రాతస్మరామి లలితా వదనారవిందం
బింబాధరం పృథుల మౌక్తిక శోభినాసం
ఆకర్ణ దీర్ఘ నయనం మణి కుండలాఢ్యం
మందస్మితం మృగమదో జ్జ్వలఫాలదేశమ్

2 ప్రాతర్భజామి లలితా భుజ కల్పవల్లీం
రక్తాంగులీయలసదంగులి పల్లవాఢ్యాం
మాణిక్య హేమవలయాంగద శోభ మానాం
పుండ్రేక్షు చాపకుసుమేషు సృణీర్దధానామ్

3 ప్రాతర్నమామి లలితా చరణార విందం
భక్తేష్ట దానవిరతం భవసింధు పోతం
పద్మాసనాది సుర నాయక పూజనీయం
పద్మాంకుశ ధ్వజ సుదర్శన లాంచనాఢ్యం

4 ప్రాతస్తువే పరశివాం లలితాం భవానీం
త్రయ్యంత వేద్య విభవాం కరుణానవద్యాం
విశ్వస్య సృష్టి విలయ స్థితి హేతుభూతాం
విద్యేశ్వరీం నిగమ వాఙ్మనసాతి దూరామ్

5 ప్రాతర్వదామి లలితే తవపుణ్యనామం
కామేశ్వరీతి కమలేతి మహేశ్వరీతి
శ్రీశాంభవీతి జగతాం జననీపరేతి
వాగ్దేవ తేతి వచసాత్రి పురేశ్వరీతి

6 యః శ్లోక పంచక మిదం లలితాంబికాయాః
సౌభాగ్యదం సులలితం పఠతి ప్రభాతే
తస్మైదదాతి లలితా ఝుటితి పసన్నా
విద్యాం శ్రియం విమల సౌఖ్య మనంతకీర్తిమ్

ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం లలితా పంచరత్నం సంపూర్ణమ్



లలితాదేవి, సోమశిల

# లలితాదేవి పూజాగీతం

శ్రీ లలితా శివజ్యోతి సర్వకామదా
శ్రీగిరినిలయా గిరామయా సర్వమంగళా

జగముల చిరునగవుల పరిపాలించే జననీ
అనునయము మము కనికరమున కాపాడే జననీ

మనసే నీవశమై స్మరణే జీవనమై
మాయని వరమీయవె పరమేశ్వరి మంగళనాయకి

అందరికన్నా చక్కని తల్లికి సూర్య హారతి
అందాలేలే చల్లని తల్లికి చంద్రహారతి

నవ్వుల తళుకుల కళలా జ్యోతుల కప్పుర హారతి
సకల నిగమ వినుత చరణ శాశ్వత మంగళ హారతి

రచన : కీ శే. శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రి
రహస్యం చిత్రం

# పురాణకృష్ణ



పురాణకృష

ప్రతికల్పంలోను ఈ సృష్టి అంతా మళ్లి క్రొత్తగా ఏర్పడుతుంది అపుడు దాన్ని బ్రహ్మ మొదటి కల్పంలో ఏ విధంగా ఉండేదో - అనగా భూగోళంపై మహాసముద్రాలు, పర్వతాలు, నదులు, ద్వీపాలు, పుణ్యవనాలు అన్నీ మళ్లి మొదటి వలెనే రచిస్తుంటాడు విష్ణువుగూడా పూర్వకల్పాలలో వలెనే అవతారాలు ధరిస్తుంటాడు లోకోద్ధరణకై కారణ జన్ములు మొదటివలెనే పుడుతూ ఉంటారు రామాయణ మహాభారతాది ప్రసిద్ధేతి వృత్తాలన్ని మరల మరల ప్రవృత్తమౌతూనే ఉంటవి అని బ్రహ్మాండ పురాణం చెబుతుంది కాబట్టి కృష్ణానది ఇంతవరకెన్ని సార్లు పుట్టిందో ఎన్నితడవలు లుప్తమై పోయిందో చెప్పలేం

ఈ నదిని గురించి అగ్ని - వాయు - స్కాంద - పద్మ పురాణాలలో వివిధమైన గాధలు లభిస్తున్నవి

ఆదియుగంలో సహ్యముని విష్ణువును గురించి తీవ్రమైన తపంచేసి లక్ష్మీనారాయణులు ప్రత్యక్షం కాగా వారిద్దరిని తన స్కంధాలపై వెలయవలసిందిగా కోరి తాను పర్వత రూపాన్ని పొందినాడు అపుడా దంపతు లతని శిఖరాలపై నదీరూపాలు ధరించి ఉద్భవించినారు

కలిపురుషుడు జనించిన పిమ్మట అతనిని చూచి నీనికాలంలో లోకం అధర్మం పెచ్చు పెరిగి పాపభూయిష్టమై పోతుందని తలచి దేవతలు బ్రహ్మ దగ్గరకు వెళ్లి దాని పరిహారం ఆలోచించమని మొరపెట్టినారు అపుడాయన విష్ణువు దగ్గరకు వెళ్లి వారి మొరను తెల్పగా విష్ణువతనితో యిపుడు భూలోకంలో సహ్యముని చాలా గొప్పతపం చేస్తున్నాడు కాబట్టి నీవతని భుజాల పైనుండి ఒక నదిని సృజించమని చెప్పినాడు అంత బ్రహ్మ ఆముని దగ్గరకు వెళ్లి విష్ణ్వాజ్ఞ వినిపించగా అంతకంటె మహద్భాగ్య మేముందని పొంగిపోయి సహ్యముని పర్వతరూపం ధరించి నిలిచినాడు

అపుడు బ్రహ్మ ఆ పర్వతం పైగల ఉత్తర శిఖరంపై తపంచేయగా విష్ణువు ప్రత్యక్షమై అక్కడ శ్వేతాశ్వత్థ రూపంలో వెలసినాడు అపుడా వృక్షమూలం నుండి విష్ణుపాదం నుండి గంగపుట్టినట్లు ఒకనది ఉద్భవించింది

అనంతరం కొంతకాలనికా పర్వతం యొక్క దక్షిణ శిఖరంపై నాలుగు వేదాలు శివుని గురించి తపంచేయగా అతడు వారికి ప్రత్యక్షమై అక్కడ కృష్ణామలక రూపంలో నిలిచినాడు అపుడు దానినుండి మరో నది పుట్టింది

బ్రహ్మ తపంచేసిన శిఖరాని కిపుడు బ్రహ్మగిరి వేదాలు తపస్సు చేసిన శిఖరానికి వేదగిరి అని వ్యవహారాలు ఆ రెండు గిరుల నుండి బయలు దేరిన పాయలు రెండూ కలిసి యిపుడు మనం చూస్తున్న కృష్ణానది రూపు కట్టింది

పరమశివు డొకపరి తపం చేయటానికి సహ్య పర్వతశ్రేణి పైకి రాగా అపుడా శిఖరాలను ప్రక్షాళనం చేయటానికి దేవలోకం నుండి కుకుద్మతి, గాయత్రి, వేణి, సరస్వతి, సావిత్రి అనే దేవకాంతలంతా వచ్చి నదీ రూపాలు ధరించి ఆపర్వత శిఖరాలను కడిగి అనంతరం కృష్ణానదిలో కలిసి దానికి పవిత్రతను చేకూర్చి పెట్టినారు

ఆదియుగంలో బ్రహ్మ సహ్యగిరిపై ఒక యజ్ఞం ప్రారంభించగా సరస్వతి సకాలంలో యాగశాలకు చేరలేదు ఆడవా రెపుడైనా ఆలస్యమే అపుడక్కడికి చేరిన దేవతలంతా కాలాతీతమై పోతుందని బ్రహ్మను హెచ్చరించగా ఆయన రెండవ భార్యయైన గాయత్రీదేవితో కూర్చుని యజ్ఞంప్రారంభించినాడు అంత యజ్ఞం నడుస్తుండగా వాగ్దేవి వచ్చి అది చూచి అక్కడ చేరిన దేవతలందరిని ఉద్దేశించి ప్రధానమైన పత్నిని నేనుండగా బ్రహ్మ గాయత్రితో యాగానికి కూర్చుంటూ ఉంటే యిది చూస్తు మీరందరెట్లా అంగీకరించినారని కోపించి

వారందరిని ఆకొండపై నదులైపొండని శపించింది అపుడా శాపానికి విష్ణువు కృష్ణగా, శివుడు వేణిగా, బ్రహ్మ కుకుద్మతిగా అయిపోయినారు

ఒకపుడు రాధాదేవి గోపికలపై కినిసి వారందరిని భూలోకంలోనదులై పొండని శపించింది అపుడు వారందరు ఈ సహ్యాద్రిపై నదులై పోయినారు

కృష్ణావతారం చాలించిన పిమ్మట నారాయణుడు గోలోకానికి వెళ్ళి కొలువుదీరగా బ్రహ్మ అతనిని చూసి యిక ముందు కలియుగం ప్రారంభమై లోకమంతా పాపభూయిష్టమై పోతుంది కనుక దానికేదైనా పరిహారం చెప్పమని కోరగా కృష్ణుడపుడు తనయంశతో సహ్యాద్రిపైగల బ్రహ్మ శిఖరిపై కష్ణానదిని పుట్టించినాడు అపుడతని పరాప్రకృతి యైన రాధాదేవి వేదగిరిపై వేణీరూపంగా అవతరించింది అపుడు రాధాదేవితో పాటు నదీ రూపాలు పొందిన గోపికలంతా క్రమంగా ఒక్కొక్కరు వచ్చి అతనితో కలిసినారు

బ్రహ్మ నాలుగు యుగాలేర్పరిచి వాని ధర్మాలు నిర్ణయించే తరుణంలో అవి నిర్దేశించలేక శ్రీమహావిష్ణువును కోరగా ఆయన లోకధర్మాలను భూలోకంలో శాశ్వతంగా నిలిపేటందుకు తనస్వరూపం సకల తీర్థాలకు మాతృక వంటిదని చెబుతూ నదులన్నింటికంటె ముందు కృష్ణానదిని సృజించి దాన్ని బ్రహ్మగిరిపై నిలిపినాడని స్కాందపురాణోక్తి

ఇవి మనకు కృష్ణానదిని గురించి వివిధ పురాణాలలో లభించే గాథలు

ఆధునిక చరిత్రజ్ఞులు గూడ దక్షిణ భారతంలో కృష్ణయే నదులన్నిటికి మొదటిదని అంగీకరిస్తున్నారు అది పుట్టి యిప్పటికి తొమ్మిది లక్షల నలభైవేల యేండ్లకు పైగా అయిందని పద్మపురాణంలో ఉత్తర ఖండంలో గల పదకొండవ అధ్యాయం వల్ల తెలుస్తుంది.

దేవతగా సాకారంతో ఈనదీమ తల్లి శ్యామవర్ణ - కమలనేత్ర - చతుర్భుజ - శంఖచక్రాది విష్ణులాంచన విభ్రాంత పీతాంబరధర - ప్రసన్నరూప అని స్కాంద పురాణ వచనం

మన జీవనదులు దైవం, ఆర్షం, మానుషం, ఆసురం అని నాలుగు విధాలు కేవలం దేవతలే నదీరూపాలు ధరించినవి దైవం మహర్షులు తమ తపోబలంతో సృజించినవి లేదా భూలోకానికి రప్పించినవి ఆర్షం మహారాజులు లేదా చక్రవర్తుల చేత పుట్టినవి మానుషం. దానవుల చేత ఏర్పడినవి అసురం అనబడుతవి

గంగానది విష్ణుపాదం నుండి పుట్టి దైవం అయినా భూలోకానికి భగీరధుడనే చక్రవర్తితో కొనిరాబడి, మార్గమధ్యంలో జహ్నుమునితో త్రాగి విడువబడి మానుషం, ఆర్షం అనే లక్షణాలుగూడ కలది అయింది

భారతదేశంలోని యితర నదులలో ఆసిక్ని- కుశావర్త - కృష్ణ - ఘృతవతి, పయస్వతి, మరుద్వతి, మరుధ్వృధ, వితస్త -విపాశ-శతద్రువు - శరావతి దేవనదులుగా ప్రసిద్ధిని పొందినవి

# చారిత్రక కృష్ణ

ఈ నది యొక్క జన్మస్థానం మహాబలేశ్వరానికి ఉత్తరంగా అరేబియా సముద్రానికి సుమారు 80 మైళ్ళ దూరాన $17^0$-59' ఉత్తర అక్షాంశ, $73^0$-28' తూర్పు రేఖాంశాల మీద పడమటి కనుమలలోని సహ్యాద్రిపై ఉంది దీని యెత్తు సముద్రమట్టానికి 4714 అడుగులు అనగా 1336 కిలోమీటర్లు అక్కడ యిది ఒక శిల నుండి పుట్టి తూర్పుగా ప్రవహిస్తుంది

ఎక్కడ ఏ ప్రకృతి చిత్రం కనిపించినా దాన్ని దైవలీలగా ప్రకట పరచటం భారతీయుల యొక్క ఆధ్యాత్మిక చింతనా మార్గంలో ఒకటి కనుక, సహ్యాద్రిపై ఈనది పుట్టిన శిలను గోముఖాకారంగా మలిచి దానికి ఒక ఆలయం కట్టినారు

ఈ పర్వత పాదంలో మహాబలేశ్వరం చాలా ప్రసిద్ధం కనుక ఈ కొండల వరుసను మహాబలేశ్వరం కొండలన్నారు ఈ పర్వత శిఖరాల నుండి చిన్నవి, పెద్దవి చాలానదులు పుట్టినవి

ఇపుడు మహాబలేశ్వర క్షేత్రం ప్రాతది- క్రొత్తది అని రెండు భాగాలుగా ఉంది క్రొత్తగ్రామం ప్రాతదానికి మూడు కి మీ దూరంలో ఏర్పడింది

ప్రాత మహాబలేశ్వరంలో కృష్ణవేణి, సావిత్రి, గాయత్రి, కుకుద్మతి, సరస్వతి అనే అయిదు నదుల ఉద్గమ స్థానాలున్నవి అని చిన్నపాటి గుహలు, వానికి ఆలయాలు కూడ కట్టబడినవి

మహాబలేశ్వరంలో మహాబలేశ్వర - అతిబలేశ్వరం - కోటీశ్వరాలయాలు ప్రసిద్ధి మహాబలేశ్వరం లింగం రుద్రాక్షవలె నొక్కులుగా ఉండి ఎపుడూ దానినుండి నీరూరుతుంది అందువల్ల పై పంచనదులు దానినుండియే పుట్టినవని అక్కడివారి విశ్వాసం

అక్కడ కృష్ణాబాయి ఆలయం కూడా ఉంది దానిలోని బ్రహ్మకుండంలో పైనదీ పంచకం పంచగంగల పేర దూడకు పాలిస్తున్న ఒక ఆవు నోటినుండి ఉద్వేగమై ధారగా దూకుతూ ఉంటవి ఆ జలం మిక్కిలి స్వచ్ఛం కనుక యాత్రికులు బ్రహ్మకుండంలో స్నానంచేసి దాన్ని తీర్థంగా పాత్రల్లో పట్టుకొని పోతుంటారు

కృష్ణాతీరంవెంట తమరాజ్యాన్ని స్థాపించుకున్న ఏరువ చోళులు బహుశః యిక్కడి కృష్ణాదేవి ఆలయంలోని సవత్సకమైన ఈ ధేనువును చూచియే ఆవుదూడను తమలాంఛనంగా స్వీకరించి ఉంటారు

కృష్ణ జన్మస్థానంనుండి ముప్పది మైళ్లు కొండలలో ప్రయాణంచేసి వాయి అనే స్థలంలో మైదానంలోనికి దిగుతుంది అక్కడ అంత వరకు సహ్యాద్రి పైననే మరో శిఖరం పై పుట్టి తనవలెనే ప్రయాణం చేసి వస్తున్న వేణి ''మాహులీ'' దగ్గర దానితో కలుస్తుంది ఇది కృష్ణలో కలిసే మొదటి నది వేణి కలిసిన పిమ్మటనే కృష్ణ 'కృష్ణవేణి' అయింది

మాహులీ క్షేత్రంలో ఏటా చైత్రం, ఆషాడం, శ్రావణం కార్తికాలలో గొప్ప ఉత్సవాలు జరుగుతుంటవి

ఈ నది మహారాష్ట్రంలో పుట్టి ఆంధ్ర కర్ణాటకలను వేరు చేస్తు సాగి సాగరునితో సంగమిస్తుంది మహారాష్ట్రలో 306, కర్ణాటకలో 482, ఆంధ్రప్రదేశ్‌లో 612 కిలో మీటర్లు ఈ విధంగా మొత్తం 1400 కిలో మీటర్లు ప్రయాణం చేసి ఇది సాగరసంగమం చేస్తుంది.

ఇది కర్ణాటకలోని బెల్గర జిల్లాలో గల ఐనాపూర్ దగ్గర మహారాష్ట్రకు, రాయచూర్ జిల్లాలోని దేవనగర్ దగ్గర కర్నాటకకు వీడ్కోలుచెప్పి తంగెడ గ్రామం దగ్గర మహబూబ్‌నగర్ జిల్లాలో కాలుమోపుతుంది అక్కిడినుండి మొదట నల్లగొండ పాలమూరు ఆ తర్వాత కర్నూలు, పాలమూరు పిమ్మట గుంటూరు, నల్లగొండ, కృష్ణా జిల్లాలను వేరు చేస్తు సాగుతుంది మహారాష్ట్ర, కర్ణాటక జిల్లాలలో 350 మైళ్ళు ప్రవహించి సతారా జిల్లాలోని ''కరాడా'' వద్ద 4714 అడుగుల నుండి 1900 అడుగులకు దిగిపోతుంది ఆ తర్వాత మరో 300 మైళ్లు పయనించి రాయచూర్ జిల్లాలో ప్రవేశించి అంతర్వేది షోలాపూరులు

దాటిన పిమ్మట 1900 అడుగులనుండి 408 అడుగులకు దిగిపోయి అక్కడొక జలపాతం ఏర్పడింది అక్కడివారు దాన్ని ''జలదుర్గ'' మని పిలుస్తారు

ఇంతవరకీనది రాతినేలపైనే ప్రవహిస్తుంది కాబట్టి వేగం ఎక్కువ వర్షాకాలంలో జలదుర్గ గర్జనలతో ప్రళయ భయంకరంగా దర్శన మిస్తుంది

ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించటానికి ముందిది 315 అడుగుల యెత్తున మైదానం ద్వారా ప్రవహించి పులిచింతల దిగువన విజయవాడలో రెండు కొండల నడుమ 4000 అడుగులు ప్రవహించి విజయవాడను దాటి 40 మైళ్లు వెళ్లి పులిగడ్డను చేరుతుంది

అక్కడినుండి మరో పదిహేను మైళ్ళు వెళ్లి, 'పెద్దపులివర్రు' దగ్గర రెండు పాయలుగా చీలి ఒకటి మోర్తోలు దగ్గర మరొకటి హంసలదీవి దగ్గర సముద్రంలో కలిసినవి ఈ పాయలనడిమి భాగమే దివిసీమగా ప్రసిద్ధిని పొందింది

ఇప్పటికీ నదిపై 30 ఆనకట్టలు, దీని తీరం వెంట 60 పుణ్య క్షేత్రాలున్నవి



నదీ తీరం



# బంధుబలగంతో కృష్ణ

కృష్ణాగోదావరులు దక్షిణ భారతానికి గంగాయమునలు  కావేరి, కృష్ణ, గోదావరి ఈ మూడు గూడ దక్షిణ భారతంలో పెద్దనదులుగా పేరుపొందినవి  వీనిలో కావేరి ఏకాండి నదికాగా కృష్ణాగోదావరులు రెండు నదీ సమూహాలు  ఉపనదులలో గోదావరికంటె కృష్ణమ్మ బలగమే ఎక్కువ  కాని సాహిత్య ప్రపంచంలో కావేరి గోదావరి కున్నంత ప్రాచుర్యం కృష్ణకు కలుగలేదు

దీనికి కుడివైపునుండి పదిహేను, ఎడమవైపు నుండి నాలుగు ప్రసిద్ధ నదులు చేరుతున్నవి. వానిలో మొదటిది వేణి ఇది 'మాహులీ' దగ్గర కృష్ణలో కలుస్తుంది  మాహులీ గడిచిన పిమ్మట ఈ నదికి 'కోట్సి' దగ్గర మొదటి ఆనకట్ట పడింది  దానితో వేగం మందగించిన కృష్ణకు మహాబలేశ్వరానికి పశ్చిమాన సహ్యాశిఖరి నుండి బయలు దేరిన కకుద్మతి - కోయినా - వచ్చి 'కారద్' వద్ద కలిసి కొత్త ఊపు నిచ్చినవి  దాని పిమ్మట 'సాంగ్లీ' వద్ద వరుణా - ఎర్నా నదులు వచ్చి కలిసి దాని వేగాన్ని పెంచినవి

'సాంగ్లీ' గాణాపత్యక్షేత్రం, అక్కడ మాఘమాసంలో గొప్ప ఉత్సవం జరుగుతుంది. సాంగ్లీ పిమ్మట 'సౌందత్తి' అనేచోట రేణుకా జమదగ్నులున్నారు  అక్కడికి మలప్రభ నాలుగు మైళ్లు

'సాంగ్లీ' దాటిన పిమ్మట కృష్ణలో కురుందవాడ వద్ద పంచగంగ  - ఆ తర్వాత క్షీరగంగ - దూధ్‌గంగ - వచ్చి కలుస్తవి  ఈ నదులన్ని మహాబలేశ్వరం కొండల్లోనే పుట్టినవి. మహాబలేశ్వరం పూనాకు 127 మైళ్లు

ఈ నది మహారాష్ట్రను విడిచే ముందు గానుగాపురంలో భీమా నది వచ్చి కలుస్తుంది. దానికి భీమరధి - చంద్రభాగ అని గూడ పేర్లు  పండరీపురం ఈ నదీ తీరంలోనే ఉంది. భీమా నదిగూడ సహ్యా పర్వతశ్రేణిలోనే పుట్టి ఆగ్నేయ దిశగా ప్రవహిస్తు షోలాపూర్, బీజాపూర్‌ల మీదుగా వస్తుంది

పండరినుండి 'కుర్దువాడి' వచ్చేదారిలో నరసింహాపురం తగులుతుంది  అక్కడ భీమతో 'నీరా' నది కలుస్తుంది  మహారాష్ట్రులు ఈ నరసింహాపురాన్ని నర్సోబావాడి అంటారు  వారు దీన్ని 'మహారాష్ట్ర ప్రయాగ' అని పండరీపురాన్ని మహారాష్ట్ర కాశి అని భావిస్తారు.

భీమానదీ తీరంలో అమరపురం మరో ప్రసిద్ధమైన క్షేత్రం దానికి నరసింహవాడి అని నామాంతరం అక్కడ భీమానదిలో కొంసారి, కుంభి, తులసి, భోగవతి, సరస్వతి అనే అయిదు నదులు కలుస్తవి కనుక అక్కడ అది పంచనదీ సంగమ క్షేత్రంగా ప్రసిద్ధిని పొందింది భీమానది ఈ నదులన్నిటిని కలుపుకొని పేరుకు తగినట్లుగా మహాభీమంగా వచ్చి కృష్ణలో కలుస్తుంది అనంతరం అది బెల్గర జిల్లాలోని ఐనాపూర్ దగ్గర మహారాష్ట్రకు వీడ్కోలు చెబుతుంది

కర్నాటకలో ప్రవేశించగానే కృష్ణకు బాగల్‌కోట తాలూకాలో ఘటప్రభ, మలప్రభ అనే నదులు కలుస్తవి ఘటప్రభ బాగెవాడి దగ్గర కృష్ణలో కలుస్తుంది అక్కడ వీరశైవాని కాద్యుడైన బసవేశ్వరుని సమాధి ఉంది ఆయన పన్నెండవ శతాబ్ది వాడు ఇపుడా సమాధి 'హిప్పరగెడాం' లో మునగగా చుట్టు ప్రకారం కట్టి రక్షిస్తున్నారు

కర్నాటక దాటి ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించిన కృష్ణకు మొదట నల్లగొండ జిల్లా నుండి మూసీనది ముచికుంద - వాడపల్లి - వజీరాబాదు దగ్గర వచ్చి కలుస్తుంది

మూసి అనంతగిరి కొండల్లోని శివారెడ్డిపేట దగ్గర పుట్టింది దాని పొడవు 152 మైళ్లు. అది జన్మస్థానం నుండి 112 మైళ్ల తూర్పుగా పయనించిన పిమ్మట ' ఆలేరు ' అనే ఉపనది వచ్చి కలుస్తుంది ఆ స్థలాన్ని అక్కడివారు 'సంగెం' అని పిలుస్తారు అక్కడ భీమలింగాలయం ఉంది

చరిత్ర ప్రసిద్ధమైన కొలనుపాక గ్రామం ఆలేరు తీరంలోనే ఉంది ఈ నది తరువాత మూసి ఆగ్నేయంగా తిరిగి కృష్ణలో కలుస్తుంది ఈ సంగమ స్థానానికి బదరికాశ్రమమని మరో పేరు అక్కడ అగస్త్యేశ్వరాలయముంది

పాలమూరు జిల్లాలో కృష్ణకు దెంది, తుంగభద్ర అనే రెండు నదులు కలుస్తవి దెంది పూర్తిగా ఈ జిల్లాకే సంబంధించింది అది ఈ జిల్లాలోనే షాబాదుకొండల్లో పుట్టి దొమ్మర్లగొందిలో కృష్ణతో కలుస్తుంది దీని పొడవు 95 మైళ్లు దీనికి దుందుభి అని మరో పేరు. ఈ నది తన పరివాహ ప్రదేశంలో అచ్చంపేట తాలూకాలోని ఎనిమిది వాగులనుండి తక్కిన తాలూకాలలో తొమ్మిది వాగులనుండి వర్షాకాలపు నీటినంతా కృష్ణలోనికి చేరవేస్తుంది

ఈ నదీతీరం వెంట ప్రస్తరికలనే ప్రాచీన సమాధులు గోనరెడ్ల నిర్మాణాలు చాలా ఉన్నవి

దెందికి గల వాగులలో అచ్చంపేట తాలూకాలోని చంద్రవాగు, నాగర్ కర్నూలు తాలూకాలోని నల్లవాగు చెప్పదగినవి నల్లవాగుకు కేసరి సముద్రం అనే నాగర్ కర్నూలు చెఱువు, చంద్రవాగుకు చంద్రసాగర్ అనే చెఱువు వేయబడినవి

అచ్చంపేట తాలూకాలోని అప్పర్ ప్లాట్‌పై మరో నల్లవాగుంది అది మందవాగును కలుపుకొని బోకిలేటికయ్యలో కృష్ణతో కలుస్తుంది ఈ మందవాగు తీరంవెంట ఆదిమమానవుల నివాసాలున్నవి

ఈ జిల్లాలో కృష్ణానదిలో కలిసే వానిలో తుంగభద్ర చెప్ప దగింది

శా గంగాసంగమ మిచ్చగించునెమదిఁ గావేరి దేవేరిగా
నంగీకార మొనర్చు నేయమున తోనానందముం జెందునే
రంగత్తుంగ తరంగ భంగముల నా రత్నాకరేంద్రుండు నీ
యంగంబంటి సుఖించెనేని, గుణ భద్రా తుంగ భద్రానదీ!

అని తెనాలి రామకృష్ణయ్య ఈ నదీమ తల్లిని ప్రశంసించినాడు కాని పాపం ఆరత్నాకరేంద్రునికి ఈమె అంగాన్ని నేరుగా అంటి సుఖించే భాగ్యం కలుగనే లేదు కృష్ణమ్మ కొంగుచాటుననే అంటవలసి వచ్చింది

తుంగభద్రకు పురాణాలలో పంపానది అని వ్యవహారం ఇది తుంగ - భద్ర అనే రెండు నదుల సమాహారం అవి మైసూరు రాష్ట్రంలో నైఋతి దిక్కున గల కొండల్లో పుట్టి పుట్టినింటికి ఎనిమిది మైళ్ల దూరంలో ఉన్న షిమోగా జిల్లాలోని కూడలి దగ్గర కూడి ఏకమైనవి

ఇపుడు తుంగాతీరంలో శృంగేరి శారదాపీఠం, భద్రపై భద్రావతి ప్రాజెక్టు ఉన్నవి. పురాణాలలో గంగా స్నానం తుంగాపానం ప్రసిద్ధి

తుంగభద్రకు ఆంధ్రలో ప్రవేశించిన పిమ్మట వార్ధా, వేదవతి, హంద్రి అనే ఉపనదులు కలుస్తవి వార్దానది మల్లాపురానికి ఎగువన, హంద్రి కర్నూలుకు దిగువన దానిలో చేరుతున్నవి.

ఈనదీ తీరంలో చరిత్ర ప్రసిద్ధమైన ఆనెగొంది, హంపి అనే పట్టణాలు, మంత్రాలయం అలంపురం అనే క్షేత్రాలున్నవి

అలంపురానికి దక్షిణకాశియని వ్యవహారం ఆంధ్రదేశంలో యిక్కడ ఉన్నన్ని ఆలయాలు మరెక్కడాలేవు అందుచేత దీన్ని అలంపురం అనే బదులు ఆలయాలపురం అనవచ్చు భారత దేశంలో మరెక్కడాలేని నవబ్రహ్మలయాలు యిక్కడి ప్రత్యేకత

పాలమూరు జిల్లాలోనికి ప్రవేశించిన పిమ్మట తుంగభద్ర అలంపూరు తాలూకాలోని కూడలి దగ్గర కృష్ణలో కలుస్తుంది ఇక్కడికి దీని పొడవు 400 మైళ్లు దీని తీరం వెంట గూడ పెక్కు క్షేత్రాలు, దీనిపై 18 ఆనకట్టలు ఉన్నవి

కృష్ణలో కలిసే పెద్దనదులలో తుంగ భద్రయే చివరిది కృష్ణానది యిక్కడినుండి దాటిన పిమ్మట మహబూబ్‌నగర్, కర్నూలు జిల్లాలను, పిమ్మట గుంటూరు, నల్లగొండ జిల్లాలను వేరుచేస్తు ముందుకు సాగుతుంది

కృష్ణానదిలో ఉత్తరాన బొంబాయి నుండి దక్షిణాన మంగళూరు వరకు పెద్దపెద్ద నదులే ఓ డజను వరకు కలిసినవి తుంగభద్రకలిసిన పిమ్మట అది యిక యేకాండీగా సాగిపోయింది కృష్ణానది యొక్క ఈ దృశ్యాన్ని ఆకాశంనుండి విమానం ద్వారా తిలకించినపుడు వే ల్పుజాలరి ఒక పెద్ద వలను పడమటిసముద్రంలో విసిరి లాగటానికి వీలుకాని ఆవలను పెద్దపులివద్రువరకు అలలతో ఆలాగే ఈడ్చుకు వస్తున్నాడా అనిపిస్తుంది అలంపురం నుండి పెద్దపులి వద్రువరకు గల యేకాండీభాగం ఆవలయొక్క ముగుదాడువలె భాసిస్తుంది అని భూగోళ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు





కృష్ణవేణి మహానదీ చిత్రపటము
బొంబాయి
భీమరథి
పండరీపురం
వేదగిరి
కృష్ణా
కృష్ణానది
పుట్టుక
పహ్యాద్రి
విజయ
కుముద
నారాయణి
తుంగభద్రా నది
హంపి విజయనగరం
తుంగ
భద్ర
అరేబియా
సముద్రము
మంగళూరు
భవనాశి
సాగర సంగమం
మద్రాసు
కృష్ణవేణి
అమరావతి
విజయవాడ
శ్రీకాకుళం
కాకినాడ
బందరు
హంసలదీవి
కృష్ణ
బంగాళాఖాతము

## కృష్ణవేణి ఉపనదుల వివరం

| క్ర సం | నది పేరు | జన్మస్థానం | పొడవు | సంగమస్థానం | ఏటా కృష్ణలో కలిపే నీరు క్యూసెక్కులలో |
|---|---|---|---|---|---|
| 1 | వేణి | మహాబలేశ్వరం | 17 కి మీ | మాహులి | |
| | | బ్రహ్మగిరి-వేదగిరినడుమ | | | |
| 2 | కోయిన | మహాబలేశ్వరం | 130 కి మీ | కరడ | 39640 లక్షలు |
| 3 | ఎర్నా | మహాదేవ పర్వతాలు | 115 కి మీ | బారామహల్ | |
| 4 | పంచాంగి | పడమటి కనుమలు | 69 కి మీ | కురుద్వాడి | |
| 5 | వరుణ | పడమటి కనుమలు | 150 కి మీ | సాంగ్లీ | 5700 లక్షలు |
| 6 | దూద్‌గంగ | సహ్యాద్రి, రత్నగిరి తాలుకా | 124 కి మీ | | |
| 7 | ఘటప్రభ | సహ్యాద్రి, బెల్గాంకు పశ్చిమం | 248 కి మీ | కూడలిసంగమం | 53800 లక్షలు |
| 8 | మలప్రభ | సహ్యాద్రి - బెల్గాంపడమట | 306 కి మీ | | 19800 లక్షలు |
| 9 | భీమరథి | పూనాజిల్లా | 861 కి మీ | రాయచూరు | 126900 లక్షలు |
| 10 | తుంగభద్ర | మైసూరు కొండలు | 531 కి మీ | కూడలి | 19800 లక్షలు తుంగ<br>19800 లక్షలు భద్ర |
| 11 | మూసి | అనంతగిరి గుట్టలు | 268 కి మీ | వజీరాబాదు | 14100 లక్షలు |
| 12 | మునేరు | పాకాల సరస్సు | 182 కి మీ | నందిగామ | 19800 లక్షలు |
| 13 | బోనాసి | భైరవగుండం, కంభంగిరి | | నివృత్తి సంగమం | |
| 14 | దెంది | షాబాదుకొండలు | 90 కి మీ | దొమ్మర్లగొంది | 2609 లక్షలు |
| 15 | నాగులేరు | నల్లమల కొండలు | | కొట్రపాడు | |
| | | కారెంపూడికి ఎగువ | | | |
| 16 | చంద్రవంక | శివారు పల్లెగుట్టలు | 22 కి మీ | తూమూరు కోట | |
| | | పల్నాడు | | | |
| 17 | ఊకచెట్టువాగు | నందారం - దౌల్తాబాదు నడుమ | 116 కి మీ | రేజింతల | |
| 18 | చిన్నవాగు | మద్దిగట్లగుట్టలు, కొత్తపల్లె దగ్గర పెద్దవాగులో కలుస్తుంది | | | |

# కృష్ణా తీరస్థ ప్రసిద్ధ క్షేత్రాలు



ఆలయం

1. కృష్ణా స్టేషన్:

ఇది మక్తల్ తాలూకాలోని మాగనూరు మండలంలో ఉంది నల్లగొండ మహబూబునగర్ జిల్లాలను చీల్చుకుంటు ఆంధ్రప్రదేశ్‌లో అడుగుపెట్టిన కృష్ణమ్మ తల్లికి యిక్కడ దత్తాత్రేయుడు నిల్చి స్వాగతం పలుకుతున్నాడు

పాలమూరు జిల్లాలో యిది ప్రాచీనమయిందేకాక ప్రసిద్ధి చెందిన దత్తక్షేత్రం ఇక్కడ దత్తాత్రేయుని ఆలయంతో పాటు యింకా చాలా ఆలయాలున్నవి మొదటినుండి యిది పుష్కరస్నానాలకు శ్రాద్ధ విధులకు ప్రసిద్ధంగా ఉంది అందుచేత యిక్కడ క్రీ. శ 1992లో పుష్కరాల సందర్భంగా స్నాన ఘట్టం కూడ కట్టినారు

ఇది షోలాపూరు నుండి బొంబాయి వెళ్లే రైల్వేలైనుపై ఉంది ఇక్కడ నదిపై గల వంతెన అంతా యినుపదూలాలతో నడుమ యెక్కడా స్తంభం లేకుండా కట్టబడింది ఇది దీని విశేషం. ఈ స్టేషన్‌కు గ్రామం ఒక కిలోమీటరు దూరంలో ఉంటుంది

2. కురుగడ్డ:

దీనికి కురువాపురం అని మరోపేరు ఇది కృష్ణానదిలో ఏర్పడిన చిన్న దీవి దత్తావతారమైన శ్రీపాద శ్రీవల్లభుడు సంచార వశంగా యిక్కడికి వచ్చి నదిలో బట్టలుదికే ఒక చాకలికి మరుజన్మలో మ్లేచ్ఛ ప్రభువై పుట్టే అట్లు- అంబిక అనే ఒక బ్రాహ్మణికి తాను

పుత్రుడై పుట్టే అట్లు వరాలిచ్చి పిమ్మట ఒక ఆశ్వయుజ బహుళ ద్వాదశినాడు కృష్ణానదిలో దేహ విసర్జన చేసి మరు జన్మలో తాను వరమిచ్చిన బ్రాహ్మణికి గానుగాపురంలో నృసింహసరస్వతియై జన్మించి ఆ జన్మలో కురుగడ్డకు వచ్చి యిపుడక్కడ ఉన్న ఆలయం కట్టించి తన యొక్క తొలిజన్మపాదుక లక్కడ ప్రతిష్టించినాడు యిపుడిది నిత్యజాగృత క్షేత్రంగా ఉంది

3. నారదగడ్డ :

దీన్ని నార్లగడ్డ అని సామాన్యులు పిలుస్తారు కృష్ణానది మహబూబునగర్ జిల్లాలో ప్రవేశించిన పిమ్మట యిక్కడ రెండు పాయలుగా చీలగా ఆనడుమ కురుగడ్డ, గుర్రంగడ్డ, నారదగడ్డ అనే దీవులేర్పడినవి ఈ గడ్డ పై చెన్నబసవేశ్వరుని ఆలయం ఉంది దాన్ని నారదుడు ప్రతిష్ఠించినట్లు చెబుతారు ఏటా ఫాల్గుణ శుద్ధ చవితినుండి పున్నమి వరకు ఉత్సవం నడుస్తుంది ఈ ప్రాంతంలో యిది చాలా పెద్ద జాతర

4. చింతరేవుల :

ఇది దరూరు మండలంలోని గ్రామంలోని గ్రామం ప్రసిద్ధమైన ఆంజనేయ క్షేత్రం ఈ స్వామిని చంద్రికాచార్యులనే వ్యాసరాయలు ప్రతిష్ఠించినాడు ఇక్కడి స్వామి ఊర్ధ్వదృష్టిగలవాడు అందుచేత ఆయన ఉగ్రత్వానికి పూజారులు నిలువలేకుండా ఉండగా దరూరు నివాసియైన శేషదాసుల వారు తపంచేసి స్వామివారి ఉగ్రత్వాన్ని తగ్గించినాడు ఇప్పటికి ఏట కొద్ది అపచారం జరిగినా స్వామి వారు పూజారులకు సర్పరూపంలో దర్శనమిస్తుంటాడు యిది ప్రసిద్ధ క్షేత్రం కాబట్టి ప్రభుత్వం యిక్కడగూడ పుష్కర స్నానఘట్టం ఏర్పాటు చేసింది

5. కృష్ణాగ్రహారం :

ఇది గద్వాలకు 4 కి మీ దూరంలో గల గ్రామం యిక్కడ ప్రాచీనమైన ఆంజనేయ వేంకటేశ్వరాలయాలున్నవి రెండువందల యేండ్ల నాడిక్కడ రామావధూత అనే యోగి తపంచేసికుంటూ ఉండగా అతనికి కృష్ణానదిలో సీతారామలక్ష్మణ మూర్తులు లభించినవి ఆయన వానినిక్కడ ప్రతిష్ఠించి ఆలయం కట్టించినాడు ప్రస్తుతం యిక్కడ ఉన్న మరాన్ని రాజా చిన్న సోమ భూపాలుడు కట్టించినాడు ప్రభుత్వం యిపుడు స్నాన ఘట్టంకూడ ఏర్పాటు చేసింది

6. గుర్రంగడ్డ :

ఇది కృష్ణాగ్రహారానికి 4 కి మీ దిగువన బీచుపల్లికి 5 కి మీ ఎగువన బీరవోలు దగ్గర కృష్ణానది మధ్యలో ఉంది ఇక్కడ మడుగు లోతెక్కువ ఎండ కాలంలో గూడ పడవ లేకుండ దాటలేరు ఒకప్పుడు నిజాం సైన్య మీ ప్రాంతానికి రాగా అందులోని నవాబుగారి గుర్రాన్ని వనపర్తి నివాసి యొకడు దొంగిలించుకొని తెచ్చి ఇక్కడ ఉంచినాడు అపుడు సైన్యం ఏలాగో ఆరాతీసి ఇక్కడికి వచ్చి అతన్ని పట్టుకున్నారు అపుడతడు ఈ గడ్డపై పచ్చిగడ్డి బాగా ఉంటుందని మీ గుర్రాన్ని యిక్కడికి తెచ్చినానని అన్నాడు దానితో నాటినుండి ఈగడ్డకు గుర్రంగడ్డ అనిపేరు నిలిచింది

7. బీచుపల్లి :

ఇది చాళుక్యుల నాటిగ్రామం పూర్వం దీనికి కణ్వాశ్రమమని పేరు. ఇది అలంపూరు తాలూకాలోని గ్రామం, ప్రసిద్ధమైన హనుమత్ క్షేత్రం ఇక్కడి స్వామిని వ్యాసరాయలు ప్రతిష్ఠించినట్లు చెబుతారు కృష్ణదేవరాయల జీవితంలో ఒక పర్యాయం కుహూయోగం రాగా ఆయన అపుడు మూడేండ్లు తన రాజ్యాన్ని వ్యాసరాయలకు దానం చేసి అనంతరం దాన్ని మరల గ్రహించి అప్పుడు వారికి మదనపల్లి జిల్లాను దానం చేసినాడట అపుడు వ్యాసరాయలు రాయలవారి కుహూయోగ ప్రభావాన్ని భరించినందుకు తత్ప్రతీహారంగా 378 ప్రాణదేవతల ప్రతిష్ఠలు చేసినట్లు హరిదాసుల సేవలో చెప్పబడింది కాబట్టి ఆప్రతిష్ఠలలో ఇది గూడ ఒకటి ఇపుడీ స్వామిని బీచుపల్లి రాయడంటారు ఈ స్వామి పూజారులు వాల్మీకులు కావటం యిక్కడి విశేషం ప్రభుత్వం యిక్కడ జిల్లాలో అన్నిటి కంటె పెద్ద స్నానఘట్టం ఏర్పాటు చేసింది

8. యాపర్ల :

ఇది వనపర్తి తాలూకా వారి గ్రామం సంస్థానాల కాలంలో యిది వారి యొక్క దివాన్‌జీయైన గోవింద నాయక్‌గారి అగ్రహారం ఆయన యిక్కడ క్రీ శ 1915 ఆనంద నామ సంవత్సరంలో పెద్ద సప్తాహం జరిపించినాడు దాన్ని మించిన సప్తాహం యిప్పటి వరకు మా జిల్లాలో మళ్లీ జరుగలేదు అపుడా సప్తాహంలో ఈ జిల్లాలోని పండితులందరూ పారాయణ కర్తలూగా, ప్రవచన కర్తలూగా పాల్గొన్నారు ఈ సందర్భంలో ఆయన కృష్ణాతీరంలో ఒక రామాలయం కట్టించి దానిముందు నదిలోనికి మెట్లుగూడ వేయించినాడు

అపుడాయన ఆసస్థానంలో దర్శించటానికి వచ్చిన యాత్రికులు పోగొట్టుకున్న నగలు కూడ మళ్లీచేయించి నాడట అయితే అది న్యాయం నాలుగు పాదాలతో నడుస్తున్న కాలం

## 9. మారుమునుగాల :

ఇది అలంపూరు తాలూకాలోని గ్రామం తాలూకాకు 15 మైళ్ల దూరంలో ఉంది స్థానికులిది మార్కండేయ క్షేత్రమని, అతడక్కడనే పరమశివుని గురించి తపం చేసి దీర్ఘాయువును పొందెనని చెప్పుకుంటారు ఈ గ్రామంలో తిమ్మగురుని మఠం, సిద్ధయ్య మఠం, గోవిందయ్యమఠం, కన్నయ్య మఠం, యాదవమఠం అని అయిదు మఠాలున్నవి వానిలో తిమ్మగురుని మఠానికే ప్రాముఖ్యం ఎక్కువ ఈ మఠం యొక్క నిర్వహణ ఒక వైశ్యుడు చూస్తుంటాడు ఏటా చైత్రబహుళ దశమినుండి ద్వాదశి వరకు మూడు దినాలు ఆరాధన జరుగుతుంది

ఇది ఏటిమునుక గ్రామం కాబట్టి గ్రామస్థు లూరుజరిగి కట్టుకున్నారు అక్కడ కుళ్లాయప్ప స్వామి ఆలయం, బ్రహ్మంగారి ఆలయం, వీరభోగ వసంత రాయని ఆలయం కూడ ఉన్నవి

## 10. కూడలి :

ఇది అలంపూరు తాలూకాలోని ప్రసిద్ధ గ్రామం తుంగభద్రానది ఇక్కడనే కృష్ణలో కలుస్తుంది అందుచేత ప్రజలు దీన్ని 'సంగెం' అని పిలుస్తారు ఇక్కడ కృష్ణాతీరంలోనివృత్తి సంగమేశ్వరం, కూడలి సంగమేశ్వరం అని రెండు ప్రసిద్ధ సంగమ క్షేత్రాలున్నవి నివృత్తి సంగమేశ్వరం దగ్గర కృష్ణానది పడమర నుండి వచ్చి ఉత్తరానికి తిరుగుతుంది సరిగా ఈ మలుపు పైననే దానికి భవనాశి వచ్చి కలుస్తుంది

కూడలి దగ్గర తుంగభద్ర కలుస్తుంది నదీప్రకారంగా యిదే పెద్ద సంగమస్థానం కాని ప్రజలు దీన్ని చిన్న సంగెం అని, నివృత్తి సంగమాన్ని పెద్ద సంగెం అని అంటారు. ఇది గూడ ఏటిమునుక గ్రామం కాబట్టి యిక్కడి ఆలయాన్ని అలంపురానికి తరలించినారు

## 11. గొందిమళ్ల :

ఇది గూడ అలంపురానికి చెందిన గ్రామమే. కేంద్రానికి అయిదు మైళ్ల దూరంలో ఉంది కూడలి ఏటిలో మునిగి నప్పటినుండి యాత్రికులు పుష్కర స్నానాలిపుడు

యిక్కడ చేస్తున్నారు ఇక్కడ గుట్టపై ఓంకారేశ్వర స్వామి ఆలయం ఉంది యాత్రికులు నదీస్నానం చేసి కొండయెక్కి స్వామిని పూజిస్తుంటారు

**12. బెక్కెం :**

కన్నడంలో 'బెక్కు' అనగా పిల్లి కనుక ఈ గ్రామంలో మార్జాలముఖి దేవత ప్రసిద్ధి ఇది యిపుడు కొల్లాపురం తాలూకాలోని గ్రామం ఈ గ్రామాన్ని క్రీ శ 1111 లో త్రిభువన మల్లుని సామంతుడైన బిజ్జరసు పాలించినాడు అతడు జీమూతవాహన వంశీయుడు శాతవాహనుల కాలంలో ఆంధ్రప్రదేశ్‌పై దండెత్తిన ఖారవేలుడు గూడ ఆ వంశీయుడే బిజ్జరసు యిక్కడ ఉదగార పోషణుడుగా ఉన్నాడు పానుగంటినుండి పండితారాధ్యుడు బసవేశ్వరుని దర్శనానికి వెళ్లుతూ దారిలో వనిపురికి రాగా బసవేశ్వరుడు లింగైక్యం చెందినట్లు తెలిసింది దానితో అతడిక ముందుకు వెళ్లలేక వెల్లగొండలో నిలువగా అక్కడి నుండి రామయ్య అనే భక్తుడాయనను యిక్కడికి తీసుకుని వచ్చినాడు అనంతరం ఆయన శివైక్యం యిక్కడే జరిగింది ఆ సమాధి యిపుడు కృష్ణానది గర్భంలో ఉంది

బెక్కెం గూడ ఏటిమునుక గ్రామం కనుక గ్రామస్థులూరిని మరోచోట కట్టుకున్నారు కుళ్లాయప్పస్వామి మఠం రామయ్యగారి సమాధిని ఏటిలో నుండి కొత్త చోటికి తరలించినాడుకాని పండితారాధ్యుని సమాధిని ఎవరుగూడ తరలించలేదు

11వ శతాబ్దంలో బెక్కెం గ్రామాన్ని పాలించిన బిజ్జరసు ఉదగార పోషణుడు - అనగా నీటి వ్యవస్థను చూచినవాడు అతని శాసనం ఉన్న చెరువు యిపుడు కృష్ణా నీటికి పెద్ద రిజర్వాయరుగా చేయబడింది

**13. వెల్లగొండ :**

ఇదిగూడ కొల్లాపురం తాలూకా గ్రామమే పండితారాధ్యుని శిష్యులలో వెల్లగొండ మహాదేవయ్య, వనిపురి శంకరయ్య, గంగాపురం బసవయ్య, మియ్యాపురం సత్తెక్క అనేవారు ఈ జిల్లాకు చెందిన వారు వెల్లగొండ మహాదేవయ్య పండితునికి వాదసమయంలో శ్లోక పాదాలందిస్తుండే వాడట

ఇపుడు వెల్లగొండ దగ్గరగల గుట్టను మయ్యన్న గుట్ట అంటారు మయ్యన్న మహాదేవన్నకు సంక్షిప్త రూపం ఇపుడా గుట్టపై ఆ దంపతుల వీరగల్లులున్నవి

14. వెల్లెపాడు

ఇది కూడా కొల్లాపురం తాలూకాకు చెందిన గ్రామం ఈ గ్రామంలో బింగరాయి ఎక్కువ అదిబురదలో కూరుకొని ఉంటుంది ఇక్కడ ప్రాచీనమైన హనుమదాలయం ఉంది

15. జటప్రోలు :

దీనికి జటాయువు ప్రోలని ప్రాచీన వ్యవహారం. రావణుడు సీతను కొనివెళ్లే టపుడు అతనితో పోరిన జటాయువు తొక్క ఒకటి తెగి యిక్కడ పడెనట అదే విధంగా జటాయువు యొక్క కాళ్లు తెగి పడిన స్థలం కాళ్లూరని, కొప్పు తెగి పడిన స్థలం కొప్పునూరని జానపదుల పురాణం

ప్రస్తుతం జటప్రోలు అని పిలువబడే గ్రామం ఒకపుడు జటప్రోలు సీమకు రాజధాని అక్కడి నుండి అది క్రమంగా పెంట్లవెల్లి, ఎల్లూరు గ్రామాల నుండి కొల్లాపుర్గానికి మారి నిలిచి పోయింది

16. మంచాలకట్ట:

ఇది గూడ కొల్లాపురం తాలూకాకు చెందిన గ్రామమే పూర్వం దీనికి మంత్రాలకట్ట, మంచాళ అని వ్యవహారాలు మంచాళ జగన్నాధ రావుగారు సంగీత ప్రపంచంలో ప్రసిద్ధుడు మొదటి సోమేశ్వరుని కాలంలో గంగపెర్మాడి విక్రమాదిత్యుడు, నొలంబ పెర్మాడి జయసింహుడు ఈ గ్రామాన్ని నేలవీడుగా చేసికుని చోళరాజైన వీరరాజేంద్రుని దాడిని త్రిప్పికొట్టినారు

ఈ గ్రామంలో మాధవస్వామి ఆలయం ప్రసిద్ధం ఇది చాళుక్యుల నాటిది మంచాలకట్ట గూడ మునుకకు గురికాగా ప్రస్తుతం ఈ మాధవస్వామి ఆలయాన్ని కొల్లాపురం ఊరి వెలుపల 'వడిద్యాల' అనేచోట పునర్నిర్మించినారు

17. రామతీర్థం :

ఇది పెంట్లవెల్లికి మూడు కిలోమీటర్ల దూరంలో గల గ్రామం. ఇక్కడ రామలింగేశ్వరాలయం ప్రసిద్ధి దానితో పాటు యిక్కడ సోమనాథ సిద్ధుడు, చిదానంద

సిద్ధుడు అనే గురుశిష్యుల సమాధులున్నవి వారు శిల్పివంశానికి చెందిన వారు కృష్ణాతీరంలోని ఈ ప్రాంతంలో గల ఆలయాలన్ని వారు, వారి శిష్యపరంపరనే కట్టినట్లు చెబుతారు

**18. మల్లేశ్వరం :**

ఇది పంచేశ్వరాలలో ఒకటి దీని పిమ్మట సోమేశ్వరం అనబడే సోమశిల ఉంటుంది ఈ క్షేత్రం పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన మొదటి జగదేకమల్లుని పేర వెలసి ఉండవచ్చు ఇపుడిదొక సముదాయం ఈ సముదాయంలో మొత్తం పదహారు గుడులున్నవి వీనినే అంగస్తేశ్వరాలయాలు అని గూడ పిలుస్తారు ఇపుడివి గోపాలపురం దగ్గర పునర్నిర్మించబడినవి



# తుంగభద్ర తీరస్థ స్థలాలు

ఈ జిల్లాలో తుంగభద్ర వెంట వేణీసోంపురం, పెద్దధన్వాడ, మాన్‌దొడ్డి, పడమటి గార్లపాడు, రాజోలి, తూర్పుగార్లపాడు, మద్దూరు, కొరివిపాడు, పుల్లూరు, ఊటుకూరు, అనే పెద్ద గ్రామాలున్నవి సుల్తానాపురం, జిల్లెళ్లపాడు, రేలపాడు, ఆవలివైపున ఉన్నా అవి ఈజిల్లాకే చెందుతున్నవి దీని తీరంలో గల అలంపురం దక్షిణకాశీగా పేరంది పాలమూరు జిల్లాకే కన్నాకుగా ఉంది

వేణీసోంపురానికి పూర్వం చ్యవనకాశ్రమమని పేరు ప్రస్తుతం అక్కడున్న వేణుగోపాల స్వామిని వ్యాస తత్వజ్ఞులు ప్రతిష్ఠించినట్లు చెబుతారు ధన్వాడలోకాయపల్లె సంస్థానికి కోశాగారంగా ఉండేదట అక్కడినీరు మంచిది కనుక లోకాయపల్లె లక్ష్మమ్మ దొరసానిగారు దినదినం అక్కడి నీటినే తెప్పించుకుని త్రాగేదట

మాన్‌దొడ్డికి మొదట మాదవనాయనిదొడ్డి అని వ్యవహారం అది యీ జిల్లాలో మరో మందోటిగా ఉంది అక్కడి విశ్వకర్మల యిండ్లు చూస్తె అవి ఆనాటి స్వాంత రాతికోటను తలపిస్తవి. వారు మంచి శిల్పులేగాక వీరులు ఇప్పటికి వారివద్ద బరువైన ఇనుప గదలు, ముద్గరాలు, ఆనాటి తుపాకులు ఉన్నవి అక్కడి విశ్వకర్మలంతా ఒకే కుటుంబానికి చెంది పంచదాయిల పనులు చేస్తున్నారు

రాజోలి గద్వాలకు ప్రతిరూపమైన పట్టణం అక్కడి కోట గద్వాల కోటవలెనే ఉంటుంది అక్కడ తుంగభద్రా నదీ తీరంలో గల వైకుంఠ ఆదినారాయణ స్వామి ఆలయం ప్రసిద్ధం. అదికాక కోటలో వీరనారాయణ, కేశవ, వేణుగోపాలాలయాలు, శ్రీదేవి- భూదేవి గుడులున్నవి

పుల్లూరికి పూర్వం పూల + ఊరు అని పేరు అలంపురంలోని ఆలయాలకు కావలసిన పూలన్నీ అక్కడి నుండియే వెళ్లేవి ఈ గ్రామంలో సూర్యనారాయణ - బదరీనారాయణ, శంకరనారాయణాలయాలది ఒక ప్రత్యేకత - ఇవిగాక ఈ గ్రామంలో చెన్నకేశవాలయం ఉంది అక్కడ ఉట్ల తిరణాల ప్రసిద్ధి

ఊటుకూరు ఒకపుడు పరగణాకేంద్రం ఆదినారాయణపేట ప్రభువులకు చెంది ఉండేది

# జటప్రోలు - పురాణ ప్రశస్తి

స్థలపురాణంలో నేటి జటప్రోలుకు జటాయుక్షేత్రమని వ్యవహారం అది దండకారణ్యంలో కృష్ణానది తీరాన శ్రీశైలానికి పశ్చిమాన యోజనత్రయ పరిమితంగా వ్యాపించిన అగస్త్యేశ్వర క్షేత్రాంతర్గతమై ఉన్నట్లు చెప్పబడింది

స్కాందంలోని ఉమామహేశ్వర సంవాదమనే శ్రీశైల ఖండంలోని నివృత్తి సంగమేశ్వరం, భవిష్యోత్తర పురాణంలోని విష్ణురహస్య ఖండంలోగల జటాయు క్షేత్రం అనే రెండు అగస్త్యేశ్వర క్షేత్రాంతర్గతంగానే ఉన్నట్లు ఆయా పురాణాలు చెబుతవి

చరిత్రలో దక్షిణాపథానికి మిక్కిలి ప్రాచీనత ఉంది పురాణ కథనానుసారం ఆర్యుల శాఖనుండి చీలిపోయి మొట్టమొదటగా వింధ్యను దాటివచ్చి యిక్కడ రాజ్య స్థాపన చేసినవాడు ఇక్ష్వాకు మహారాజు చివరికొడుకైన 'దండుడు' అతడు దుర్మార్గుడై తండ్రితో వెళ్లగొట్టబడి యిక్కడికి వచ్చి 'మధుమంతం' అనే పట్టణాన్ని స్థాపించుకొని ఈ ప్రాంతంలోని ఆటవికులకు ప్రభువైనాడు

అప్పటికే యిక్కడ బుుష్యాశ్రమాలు గూడ వెలసినవి దానవగురువైన శుక్రాచార్యుడిక్కడనే ఉండేవాడు దండుడొకనాడు వేటకు వెడలి శుక్రుని ఆశ్రమ ప్రాంతానికి వచ్చి అక్కడ శుక్రుని కూతురైన 'అరజ' - అనగా మాచకమ్మ - ఒంటరిగా కనిపించగా కామపరవశుడై బలవంతంగా ఆమెను భోగించి వెళ్లినాడు అంత కార్యార్థమై ఆశ్రమం విడిచి వెళ్లిన తండ్రి రాగానే అరజ దుఃఖంతో జరిగిన విషయం చెప్పింది దానితో అతడు క్రుద్ధుడై నీరాజ్యం పాంసువర్షం శిలావర్షం కురిసి నిర్మానుష్యమై పోవుగాక ! అని శపించినాడు ఆ శాపంతో దండునిరాజ్యం నిర్మానుష్యమై అరణ్యంగా మారింది

బహుశః ఆనాడు దండుడు చేసిన అక్రమానికి శుక్రశిష్యులతని రాజ్యంపై దుమ్మెత్తిపోసి రాళ్లు విసిరి నాశనం చేసి వుంటారు ఇది ఈశాపం వెనుక గల చరిత్ర

పురాణ పరిశోధకులు వైవస్వత మనుయుగం క్రీ పూ 3100 అని అంగీకరిస్తున్నారు కాబట్టి అతని కుమారుడైన ఇక్ష్వాకువు దండుడు క్రీ పూ 3200 కాలంలో ఒదుగుతారు.

దండుని పిమ్మట దక్షిణా పథానికి వచ్చిన ఆర్య ఋషి అగస్త్యుడు అతడు వశిష్ఠుని సోదరుడు

వింధ్యపర్వతం ఒకపుడు మేరువుతో పోటీపడి విపరీతంగా పెరిగి సూర్యగమనాన్ని అడ్డగించగా మహర్షులందరూ బ్రహ్మదగ్గరకు వెళ్లి మొరపెట్టినారు అంత అతడు వారితో మీరు అగస్త్యుని దగ్గకు వెళ్లమని పంపినాడు అపుడు వారు వచ్చి అగస్త్యునితో ''మహర్షీ! వింధ్యుడు విపరీతంగా పెరిగి సూర్యగమనాన్ని నిరోధించినాడు దక్షిణా పథమంతా అంధకారబంధుర మయింది ఈ యాపదనుండి మీరే కాపాడవలెనని'' ప్రార్థించినారు అంత అగస్త్యుడు దక్షిణ దేశయాత్రకు బయలుదేరి వింధ్య పర్వతం దగ్గరకురాగా ఆ పర్వతరాజు తనరూపాన్నంతా కుంచించుకుని నమ్రుడై ఆ మహర్షికి నమస్కరించినాడు అపుడగస్త్యుడతనితో 'ఓయీ పర్వతరాజా! నేను దక్షిణ దేశయాత్రకు వెళ్లుతున్నాను నీవు అంత ఎత్తుగా ఉంటే నేనెక్కలేను కనుక తిరిగి వచ్చేవరకు ఈలాగే వినమ్రంగా ఉండు' అని కోరినాడు వింధ్యుడు ఆమహర్షి కోరిక నంగీకరించి తన రూపాన్నంతా ఉపసంహరించుకొని నిలిచినాడు పిమ్మట అతనిని దాటి దక్షిణదేశం వచ్చిన అగస్త్యుడిక మళ్లి ఉత్తరానికి వెళ్లలేదు ఆ తరువాత మళ్లీ వింధ్యుడు విజృంభించ లేదు

వింధ్య పర్వతాన్ని ఈ విధంగా అణచినాడు కాబట్టి 'అగం వింధ్యాచలం స్త్యాయతి స్తంభయతి యితి అగస్త్యః' అని ఆనాటినుండి ఆ మహర్షికి అగస్త్యుడని రూఢి అయింది అగస్త్యభ్రాతకు పేరు లేదు గాని వింధ్యను అణచే కంటె మొదలు అతని పేరుగూడ ఏదో మనకు తెలియదు

వింధ్యకు పారియాత్రమని వ్యవహారం ఆర్యులు దాని ఔన్నత్యాన్ని చూచి దాటలేమని శంకించి ఆర్యావర్తానికి సీమాపర్వతంగా అంగీకరించిన కాలంలో అగస్త్యుడు ధైర్యంచేసి మొదటగా ఆ పర్వతాన్ని దాటి అంధకారబంధురమైన దక్షిణా పథంలో కాలుపెట్టి ఆర్యనాగరికతను విస్తరింపజేసినాడని ఈనాటి పరిశోధకులు అంగీకరిస్తారు.

దక్షిణా పథానికి వచ్చిన పిమ్మట ఇక్కడి సముద్ర జలాన్ని త్రాగి దానిలో దాగిన కాలకేయులనే దస్యులను బయలు పరచి ఇంద్రునికి వారిని వధించే అవకాశం కల్పించినాడు అనగా ఈ దేశంలోని సముద్రపు దొంగలజాడను కనిపెట్టి ఇంద్రునికి తెలిపినాడు ద్రావిడ భాషకు లిపిని రూపొందించి దానికొక వ్యాకరణం కూడ రచించినాడు. ఇక్కడి దేశంలో

గల విదర్భరాకుమారియైన లోపాముద్రను వివాహమాడి గృహస్థుడై శ్రుతపర్వుడు - బ్రధ్నశ్వుడు - త్రిసదస్యుడు - అనే ఆర్యరాజులను దర్శించినాడు ఇల్వలుడనే దానవ ప్రభువును తన యుక్తితో జయించి అతని యొక్క అపారమైన ధనాన్ని పొంది భార్యతో కొంతకాలం సుఖించి అనంతరం మలయపర్వతంపై ఆశ్రమం ఏర్పరచుకొని నిలిచిపోయినాడు

ఇక్ష్వాకు కుమారుడైన దండుడు అగస్త్యునికంటె యిక్కడ మొదట వచ్చిన వాడుగానే కనిపిస్తాడు కనుక ఆమహర్షి దర్శించిన శ్రుతపర్వుడు మొదలైన రాజులు అతని సంతతికి చెంది చిన్న చిన్న రాజులై ఉంటారు

దక్షిణా పథంలో ఆనాడు అగస్త్యుడు స్థలదర్శనార్థమై సంచరించిన స్థలాలన్నిటిలో శివప్రతిష్టలు చేసినాడు కాబట్టి అవన్ని యిపుడతని పేర అగస్త్యేశ్వరాలయాలుగా పిలువబడుతున్నవి

అగస్త్యేశ్వరాలయాలు రెండురకాలుగా కనిపిస్తున్నవి ఒకటి ఆ మహర్షియే స్వయంగా ప్రతిష్టించినది రెండవది ఆయిన సంచరించి వెళ్లిన పిమ్మట ఇతరులతని జ్ఞాపకంగా చేసినవి అటువంటి వానిలో కృష్ణాతీరంలోని ఈ అగస్త్యేశ్వరం మొదటి తరగతికి చెందిందిగానే చెప్పబడుతుంది

అగస్త్యుని పిమ్మట దక్షిణ దేశానికి వచ్చిన రెండవ మహర్షి వ్యాసుడు శివుడు కాశినుండి వెళ్లగొట్టిన పిమ్మట అతడిక్కడికి వచ్చి దాక్షారామాన్ని ఆశ్రయించినాడు

దక్షిణ భారతంతో కృష్ణ, గోదావరి, కావేరి పుణ్యనదులు కాబట్టి మహర్షులందరు ఎపుడో ఒకపుడు వానిని దర్శించి వెళ్లినవారే అందుచేతనే యిపుడాయా నదుల తీరాలలో వారుచేసిన ప్రతిష్ఠలు కనిపిస్తుంటవి

మహర్షులేగాగ అరణ్యవాస సందర్భంలో శ్రీరాముడు, పాండవులు, దక్షిణ దేశానికి వచ్చిన వారే అందుచేత ఇక్కడ శ్రీరామునిపేర, పాండవుల పేర వెలసిన ప్రతిష్ఠలు గూడ అనేకం మనకు దర్శనమిస్తుంటవి

ఇపుడు మనం జటప్రోలు అని చెప్పబడే క్షేత్రం అగస్త్యేశ్వరానికి పశ్చిమంగా గవ్యూతి దూరంలో ఉన్నట్లు స్థలపురాణంలో చెప్పబడింది 'గవ్యూతిః క్రోశయుగం' అని ద్వైర్ఘ్యమానం కనుక అగస్త్యేశ్వరం మూడు యోజనాల విస్తారం కలదికాబట్టి స్థానికులు కృష్ణాతీరంవెంట బెక్కెం నుండి మారునునుగాల వరకుగల ప్రాంతమంతా దాని క్రిందికే వస్తుంది అంటారు అందుచేత యిపుడు బెక్కెంలోని మూకనుళ్ల, పంచేశ్వరాలు, అమరగిరి అన్ని దానిలోని విగనే చెప్పవలసి ఉంటుంది



జటప్రోలు ఆలయం

# జటప్రోలు చరిత్ర

శ్రీశైలం ప్రాజెక్టు పుణ్యంగా జటప్రోలు సీమలో మునిగి పోతున్న గ్రామాలలోని ప్రాచీనాలయాలు తరలించటానికి చేపట్టిన పథకం క్రింద జరిపిన త్రవ్వకాలలో కృష్ణాతీరం వెంట నవీన శిలాయుగం నాటి అవశేషాలెన్నో బయల్పడి ఈ ప్రాంతంలో క్రీస్తుపూర్వం ఎంతో మొదటి నుండియే చరిత్ర ప్రారంభమై మానవ నాగరికత వికసించిందని తెలుస్తుంది

కృష్ణాతీరంలోని అగస్త్యేశ్వరానికి మల్లేశ్వరమనే మరో పేరు గూడా ఉంది అక్కడ అగస్త్యేశ్వరుడు, మల్లేశ్వరుడు అనే శివ ప్రతిష్టలేకాక అగస్త్యేశ్వరానికి క్రోసెడు దూరంలో పూర్వం మల్లేశ్వరం అనే గ్రామం కూడ ఉండేది

కళ్యాణి చాళుక్యులలో యుద్ధ మల్లులు ముగ్గురు, ఆహవ మల్లులు యిద్దరు, భువనైక మల్ల, త్రిభువనమల్ల, భూలోక మల్ల, జగదేకమల్ల అని మల్ల బిరుదాంచితులు పలువురున్నారు కనుక మొదట యిక్కడ అగస్త్యేశ్వరుడుండగా అతని ప్రక్కగా ఈ మల్లేశ్వరుని వారిలో యెవరు ప్రతిష్ఠించి గ్రామాన్ని స్థాపించిరో తెలియదు

శాతవాహనుల పిమ్మట వచ్చిన ఇక్ష్వాకులకు ఇక్ష్వాకువంశంతో సంబంధముందని పరిశోధకులంటున్నారు తెలంగాణంలోని అయిజెనాడు - అయోధ్య - కాసలనాడు - కోసల - అనేపేర్లు యిక్ష్వాకువంశ సంబంధాన్నే సూచిస్తవి కాబట్టి దక్షిణ దేశంలోని స్థలాలపై రామాయణ సంఘటనారోపాలు ఎక్కువగా ఇక్ష్వాకుల కాలంలోనే రూపుదిద్దుకోని ఉండవచ్చు

ఇపుడు జటప్రోలులో ఉన్న కోటను పల్లవులు కట్టించినట్లు స్థానికుల విశ్వాసం ఇదేవిధంగా నాగర్‌కర్నూల్ చెరువు కేసరి సముద్రం అమరాబాదు పీరభూమిపై గల పదరగ్రామంలోని పరశురామేశ్వరాలయం గూడ పల్లవుల నాటివే అని చెప్పుకుంటారు.

పల్లవులకు తెలింగాణంతో అందునా పాలమూరు జిల్లాతో సంబంధం బొత్తిగా తక్కువ క్రీ శ 6వ శతాబ్దినాటికి నేటిపాలమూరు జిల్లాకు వంగూరువాటి అని పేరు. అది చాళుక్య విషయంలో ఒక భాగం అయితే చాళుక్య రెండవ పులకేశిపై పల్లవ నరసింహవర్మ దండెత్తి వంగూరు విషయాన్ని వశపరచుకున్నాడు వారిపాలనలో అది సుమారుగా యిరువ దేండ్లున్నది కాబట్టి అది ఈ జిల్లాకు పల్లవుల కాలంగా చెప్పవలె

పులకేశి తరువాత రాజ్యానికి వచ్చిన విక్రమాదిత్యుడు పదమూడేండ్లు పల్లవులతో పోరాడి తండ్రి పోగొట్టుకొన్న రాజ్యాన్ని తిరిగి వశపరచుకున్నాడు ఈ విషయం మనకు శ్రీగడియారం రామకృష్ణ శర్మగారు పరిష్కరించిన ఆముదాలపాడు శాసనం వల్ల తెలుస్తుంది

పూర్వం ప్రభువు లెక్కడ కోటలు గట్టినా, నూతన గ్రామాలు నెలకొల్పినా అక్కడ మొదట ఏదో ఒక దైవ ప్రతిష్ఠ చేసిన పిమ్మటనే తక్కిన నిర్మాణ కార్యక్రమం ప్రారంభించే వారు కాబట్టి జటప్రోలు కోటలో ఉన్న జటేశ్వర ప్రతిష్ఠ మొదట ఆనాడు కోటను ప్రారంభించిన వారే చేసి ఉండవచ్చు

జటప్రోలు కోటను ఈనాడు మనం చూస్తే అది అంతా ఒక్కరిచేత మీదుగానే పూర్తియైనట్లు తోచదు అందుచేతదాన్ని పల్లవులు ప్రారంభించగా చాళుక్యులు పూర్తి చేసి ఉంటారు

ఆనాటి చాళుక్య విషయంలో నేటి మహబూబ్ నగర్ జిల్లా గూడ ఒక భాగం చాళుక్యులలో మొదటివారు జైనులు జైనంనుండి వైదికానికి మారినారు ఈ జిల్లాలోని అలంపురంలోని ఆలయాలు, మంచాలకట్ట మాధవస్వామి, పెంట్లవెల్లిలోని వేంకటేశ్వర- చిన్నమర్రూరులోని కేశవ - జటప్రోలులోని మదనగోపాల ఆలయాలన్ని వారికాలంలోనే వెలసినవి

వారు మొదట జైనులు కనుక అనాటికి ఈ ప్రాంతంలో గూడ జైనమే ఉన్నది అందుకు ప్రస్తుతం జటప్రోలు సమీపంలోని సింగోరంలో గల జైన మూర్తి ఒక నిదర్శనం బహూశా సిద్ధేశ్వరం గూడ జైనులదే కావచ్చు అందుచేతనే దానికి ప్రతిగా వారీ ప్రాంతంలో యిన్ని వైదికాలయాలు కట్టించినారనిపిస్తుంది

జటప్రోలు సంస్థానంలో వచ్చిన కావ్యాలు మంచాల కట్ట మాధవస్వామి ఆలయం, జటప్రోలు మదనగోపాల స్వామి ఆలయం, సురభి మాధవరాయలు కట్టించినట్లు చెబుతవి కాని ఆనాడు చాళుక్యులు కట్టించిన ఆలయాలు మొదట వైభవంగా వెలిగి కొంతకాలానికి వాని నడక కుంటుపడగా ఆదశలో వాటిని సురభివారు చేతికి తీసుకుని పునరుద్ధరించి ప్రాకారాది నిర్మాణాలు చేయించి ఉంటారు అందుచేత ప్రజల దృష్టిలో అవి వారి నిర్మాణాలుగా నిలిచిపోయినవి

జటప్రోలు మొదట ఆమనగంటి సీమలోని ఒకసామాన్యగ్రామం క్రీ శ 12 వ శతాబ్దిలో దాన్ని రేచెర్ల బేతిరెడ్డి ఎరుకసానమ్మల కొడుకు మల్లానాయడు దాన్ని ఒక పరగణాకు

కేంద్రంగా చేసి కామినేని గోపయ్యకు వ్రాసియిచ్చినట్లు ఒక సనదు ఉంది ఆ తర్వాత అది మరికొందరి చేతులు గూడ మారి ఉండవచ్చు

చివరిసారిగా క్రీ శ 16వ శతాబ్ది ప్రథమ భాగంలో ఆనెగొంది ప్రభువైన అరవీటి రామరాయల చేత కుమారమా దానాయనికి ఈయబడింది ఈ సనదును క్రీ శ 1629లో అబుల్ హసన్ తానీషా ప్రభువు పునరుద్ధరించినాడు అంతవరకు సురభివారి పాలన యింకా యిక్కడ కుదురుకోనట్టే లెక్క

చంద్రికా పరిణయకర్తయైన మాధవరాయలు క్రీ శ 17వ శతాబ్ది ప్రారంభంలో సింహాసనానికి వచ్చినాడు ఆయన కవి, పండిత పోషకుడు, కళాభిమాని, దైవభక్తుడు కనుక సన్నదు ప్రకారం జటప్రోలు పరగణా తమచేతికి వచ్చిన పిమ్మట దాదాపు వందసంవత్సరాలకు మళ్లీ అక్కడి ఆలయాలకు వైభవ దశ అందుకున్నది జటప్రోలు సురభివారికి విజయనగర ప్రభువులతో ఈయబడింది కాబట్టి అంతవరకు ఆలయ మాత్రంగా ఉన్న మంచాలకట్ట - జటప్రోలు గుడులకు విజయనగర శిల్పంతో మంటపాలు కట్టించి గోపురాలెత్తించినాడు

వీరు పునరుద్ధరించిన వానిలో చిన్నమర్రూరు కేశవాలయం, మంచాలకట్ట వేణుగోపాలాలయం, జటప్రోలు మదన గోపాలాలయం, పెంట్లవెల్లి శివకేశవాలయాలు ముఖ్యమైనవి క్రీ శ 1565 నుండి రామరాయలు జటప్రోలు సీమను చిన్నమర్రూరు నుండి పాలించినాడు ఆ కారణంగా అపుడక్కడ కోట కట్టించి కేశవాలయాన్ని పునరుద్ధరించినాడు క్రీ శ 1700 నుండి మాధవ రాయలు జటప్రోలు నుండి పాలించి అక్కడి మదన గోపాలాలయాన్ని పునరుద్ధరించినాడు మంచాల కట్ట అయ్యవారిపల్లె వీరు బ్రాహ్మణులకిచ్చిన అగ్రహారాలు కాబట్టి అక్కడి ఆలయాలు పునరుద్ధరింప బడినవి మాధవ రాయల పిమ్మట చిన్నమాధవరావు పెంట్లవెల్లి నుండి పాలించినాడు కాబట్టి అపుడక్కడి ఆలయాలు బాగుచేయబడినవి ఈ విధంగా వీరిన్ని ఆలయాలు పునరుద్ధరించినా వానిలో జటప్రోలుది మాత్రమేచెప్పదగింది

# పంచేశ్వరాలు

జటుప్రోలు సీమలోని కృష్ణాతీరం వెంట సిద్దేశ్వరం, సంగమేశ్వరం, కపిలేశ్వరం, అగస్త్యేశ్వరం, సోమేశ్వరం అని అయిదు ఈశ్వర స్థానాలు ప్రసిద్ధి – ఈ అయిందింటికి కలిపి పంచేశ్వరాలని వ్యవహారం

ఇక్కడ కృష్ణానది పశ్చిమ దిశనుండి వచ్చి తనకు అడ్డంగా ఉన్న ఒక కొండ కనుమను తొలుచుకొని ఉత్తరంగా తిరిగి ముందుకు సాగింది అది ఉత్తరవాహినియైన మలుపు పైననే సరిగా ఈ పంచేశ్వరాలు వెలసినవి

కృష్ణకు కుడివైపు అనగా తూర్పుతీరంలో సిద్దేశ్వరం, సంగమేశ్వరం, కపిలేశ్వరం అనేమూడు క్షేత్రాలు ఎడమవైపు అనగా పశ్చిమతీరంలో అగస్త్యేశ్వరం, సోమేశ్వరం అనే రెండు క్షేత్రాలు వెలసినవి

కృష్ణానదికి సరిగా ఈ మలుపు పైననే అహోబలం కొండలలో పుట్టిన భవనాశిని పశ్చిమ వాహినిగా వచ్చి కలుస్తుంది మన పురాణాలలో సింధు, శోణ, నర్మద, భిద్య, బ్రహ్మపుత్ర, భైరవి, దామోదర అనే నదులు మాత్రమే పశ్చిమ వాహినులుగా చెప్పబడినవి కాబట్టి యిక్కడ యిది పశ్చిమ వాహినిగా ఉండటం ఒక విశేషం ఈ నది యొక్క తూర్పుతీరంలోనే కపిలేశ్వరం అనే క్షేత్రం ఉంది ఇక్కడ దీనితో కృష్ణలో కలిసే వానిలో ప్రసిద్ధమైన నదులు ఏడయినవి కనుక దీన్నిక్కడ సప్తనదీసంగమం అని పిలుస్తారు

సాధారణంగా నదుల వెంట ద్వివేణి, త్రివేణి, చతుర్వేణి సంగమాలు పంచనదీ, షణ్ణదీ సంగమాలేగాని సప్తనదీ సంగమాలు తక్కువ అందుచేత సంగమ క్షేత్రాలలో దీనికి ఎక్కువ ప్రాముఖ్యం ఉంది

ఇక్కడి సప్తనదులలో కృష్ణవేణి, భీమరధి, తుంగభద్ర - ఈ మూడు ఏకత్వ రూఢిని పొందిన ద్వంద్వ వాచకాలు ఘటప్రభ, మలప్రభ - (మలాపహారిణి) కుందేరు ఈ మూడు ఏకవాచకాలు

తూర్పువాహినులకు నదులని, పశ్చిమ వాహినులకు నదాలని వ్యవహారం కనుక భవనాశి చిన్నదైనా యిక్కడ నదం అనే గౌరవాన్ని పొందిన వాహిని ఈ విధంగా యిది సప్తనదీ

సంగమమే కాక నదీనద సంగమ స్థానమనే విశేష ఖ్యాతిని గూడ సంతరించుకున్న స్థలమయింది అందుచేతనే కాబోలు యిక్కడ యిన్ని క్షేత్రాలు ఒక్క పెట్టున వెలసినవి

ఇక్కడ కృష్ణానదికి తూర్పుతీరంలో ఉండే క్షేత్రాలలో సంగమేశ్వరానికి విశేషఖ్యాతి ఉంది దానికి నివృత్తి సంగమమని పురాణ వ్యవహారం స్కాందపురాణాంతర్గతమైన ఉమామహేశ్వర సంవాదంలో ఈ నివృత్తి సంగమ క్షేత్ర మహాత్మ్యం సప్తాధ్యాయ పరిమితంగా చెప్పబడింది

ఇక్కడ సంగమ క్షేత్రాలు రూపాల సంగమం, నివృత్తి సంగమం, కూడలి సంగమం అని మూడున్నవి అందుచేత ప్రజలు నివృత్తి సంగమాన్ని చిన్న సంగెం అంటారు

కృష్ణానదిలో ఘటప్రభ కలిసే చోటును కన్నడులు కూడలి సంగమం అంటారు. బసవేశ్వరుని వచనాలన్ని ఆదేవుని పేరనే ఉంటవి ఇక్కడ కృష్ణలో కలిసే వానిలో భీమరథి పిమ్మట తుంగభద్రనదే పెద్దది కాబట్టి అది కలిసే స్థలాన్ని తెలంగాణా వారు పెద్ద సంగెం అని పిలిచినారు దీన్ని గూడ వారు కూడలి సంగమం అనే అంటారు ఇదిపుడలంపూరు తాలూకాలో ఉంది

ఇపుడు కృష్ణానది యొక్క తూర్పుతీర క్షేత్రాలన్ని కర్నూలు జిల్లాకు, పశ్చిమ తీర క్షేత్రాలు పాలమూరు జిల్లాకు చెందుతున్నవి వానిలో

| | | |
|---|---|---|
| బిలంకామాక్షమ్మ | - | నరసింహుని కోన |
| సంగమేశ్వరం | - | అగస్త్యేశ్వరం |
| సిద్ధేశ్వరం | - | సోమశిల |

అనేవి కృష్ణాతీరంలో పూర్తిగా ఎదురెదురుగా ఉన్నవి పూర్వం సిద్ధేశ్వరం సంగమేశ్వరం నడుమ కేవలం కాలిబాట మాత్రమే ఉండగా మాణిక్యస్వామి అనే అతడు సిద్ధేశ్వరం నుండి సంగమేశ్వరం వరకు కృష్ణవెంట బలమైన రాతిగోడ కట్టించి ఉద్ధిపోయించి సంగమేశ్వరానికి బండ్లు వెళ్లేదారి చేయించినాడట దాని అవశేషాలిపుడున్నవి కాని యితడే కాలం వాడో తెలియదు

సంగమేశ్వర క్షేత్ర మహాత్మ్యంలో కపిలేశ్వరం యొక్క ప్రసక్తి ఉంది గాని సిద్ధేశ్వర ప్రసక్తి లేదు స్థానికులది సిద్ధులు కట్టించినట్లు చెబుతారు సిద్ధులు దేవయోనులలో ఒకరు వారణి మాది అష్టసిద్ధులు కలవారు వారుకాక నాథ సంప్రదాయకులకు, జైన సన్యాసులకు

గూడ సిద్ధులనియే వ్యవహారం నాధ సంప్రదాయకులు ఆస్తికులు వారు యోగనాధుడైన పరమశివుని ఆదిసిద్ధునిగా భావించి పరంజ్యోతి స్వరూపాన్ని ధ్యానిస్తారు. కాని భాగవతంలోని నాభికుమారుడైన ఋషభుడు వారి కాది తీర్థంకరుడైనా జైనులు మాత్రం ఆస్తికులుగా లెక్కింపబడలేదు

ఇక్కడి రూపాల సంగమేశ్వరాన్ని కర్నూలు దగ్గర తిమ్మాపురంరోడ్డుకు జగన్నాధం గట్టుకు తరలించినారు అపుడా శిధిలాలలో అలంపూరులోని జోగులాంబాలయ ద్వార పాలికను పోలిన ప్రతిమకూడ ఒకటి అక్కడికి చేరింది అది తెల్లని రాతిది సగం వరకు విరిగింది కాని పరిమాణంలో కాస్త చిన్నదిగా అనిపించినా ఆ ప్రతిమ పూర్తిగా అలంపుర శిల్పాన్నే పోలి ఉంది

అలంపురం గూడ ఒకపుడు జైన క్షేత్రమేనని అక్కడి జోగుళాంబ జైనులయొక్క యోగినీ దేవత అనిగూడా ఒక వాదం ఉంది ఇపుడు సోమేశ్వరం నుండి కృష్ణను దాటగానే మొదట సిద్దేశ్వరమే వస్తుంది అక్కడికి రూపాల సంగమేశ్వరం ఫర్లాంగు దూరంలోనే ఉంది కాబట్టి జగన్నాధం గట్టుకు చేరిన ఈ యోగినీ శిల్పం ఆనాటి సిద్దేశ్వరానికి చెందిందే నేమో అనిపిస్తుంది

శైవులు జైనానికి బద్ధ విరోధులు జైనం ఎంతగా అహింసను పాటించిందో వారిపై శైవులంతగా హింసను ప్రయోగించినారు జైనమతాన్ని వారు నాశనం చేసి నంతగా మరెవరూ చేయలేదు కాబట్టి సిద్దేశ్వరం జైనక్షేత్రం కావటం వల్లనేమో దాని మహిమలేవి సంగమేశ్వర స్థలపురాణంలోని కెక్కలేదు

పురాణకర్తలు చెప్పకున్నా అక్కడి సిద్ధుల కధలు కొన్ని అక్కడక్కడ ప్రజల నాలుకలపై ఉన్నవి సిద్దేశ్వరంలో పూర్వం నాగిరెడ్డి స్వామి అనే ఒక సిద్ధుడుండెనట. ఆయన కృష్ణాతీరంలో కూర్చున్నపుడు పడవవారు స్వామి ఆవతలివైపుకు వస్తారా। అని అడిగితే మీరు పదండి నేను వస్తానుగాని అని చెప్పి పడవ వారావలి తీరం చేరే వరకు ఆయన వారి స్వాగతాని కక్కడ సిద్ధంగా ఉండేవాడట ఆకాలంలో అక్కడికి ఒకగౌడు గుర్రంపై తిత్తులతో కల్లు తెచ్చేవాడట అతడు నాగిరెడ్డి స్వామికి కనిపిస్తేచాలు ఒరేయ్! దప్పి వేస్తుంది కాసింత కల్లుపోయిరా। అని అడిగి తిత్తులమూతి విడిచిపించుకొని రెండు తిత్తుల కల్లు మట్టగా గుటకాయస్వాహా చేసేవాడట: కల్లువాడు ఏంస్వామీ। కల్లుమొత్తం త్రాగితిరే అని అంటే ఆలాగా మళ్లిమూతులు కట్టి గుర్రంపై వేసి కోవోయ్। అనేవాడట. అతడు వాటిని గుర్రంపై

వేసికోగానే అవి యధా ప్రకారంగా నిండి ఉండేవట ఇటువంటి మహిమలింకా అతనివి చాలా ఉన్నవి అక్కడి వారింకా అతనిని మరిచిపోలేదు ఏటా ఏరువాక పున్నమనాడు బిలంకామాక్షమ్మ ముందతని పేర సమారాధన చేస్తున్నారు

అక్కడ ఉన్న మరోసిద్ధుడు కుక్కలస్వామి ఆయనగ్రామంలో భిక్షాటన చేసి తనకు లభించిన అన్న మంతా వీధి కుక్కలను పిలిచి పెట్టేవాడట ఆనాడతడు నివసించిన గుడినిపుడు ప్రజలతని పేర కుక్కలస్వామిగుడియనియే పిలుస్తున్నారు అది రూపాల సంగమేశ్వరానికి పైన ఉంది.

సిద్దేశ్వరంకంటె సంగమేశ్వరం ఎత్తుపై ఉంటుంది . ఆ రెంటి నడుమ మైలున్నర దూరం ఉంది ఈ నడుమ రూపాల సంగమేశ్వరం ఉంది అక్కడ స్వామివారి ఆలయం రధాకారంలో ఉంది

శివుని కెక్కడైనా లింగాకారమే కాని విష్ణువు వలె అర్చామూర్తి ఉండదు కాని క్వాచిత్కంగా అక్కడక్కడ శివునికి ప్రతిమా రూపాలు గూడ లేక పోలేదు అటువంటి వానిలో ఈక్షేత్రం ఒకటి ఇక్కడి ఆలయంలో శివ పార్వతులొకే శిలలో మలువమడి యుండిరటగాని యిపుడవి లేవు ఎవరు తీసికు వెళ్లినారో తెలియదు ఈ ఆలయంలో ఎవరో భక్తులిపుడొక సామాన్యమైన శివలింగాన్ని ప్రతిష్ఠించినారు ఈ ఆలయానికే మంటపస్థానంలో రధాకారమైన గుడి ఉండేది దాన్నే యిపుడు జగన్నాధం గట్టుకు తరలించినారు

కోణార్కలో సూర్యాలయం పూర్తిగా రధాకారంలో ఉంది మహాబలిపురంలో హంపి, విజయనగరాలలో రాతిరధాలున్నవి గాని ఆలయమే రధాకారంగా యిక్కడ తప్ప మరెక్కడాలేదు ఈ రధం గూడ ఒకే సారి గర్భాలయానికి కరుమకొని ఉంది

జానపదులు చెప్పే పురాణం ప్రకారం ఈ రధం మొదట నివృత్తి సంగమేశ్వరంలో ఉండేది ఆ ఆలయంలోని దుర్గాశివులు దినదినం రాత్రివేళ స్వస్వరూపంతో దాన్నెక్కి శ్రీశైలం వెళ్లి విహరించి కోడికూసేలోపల మళ్లీ యధాస్థానం చేరి ఎప్పటివలె నిలిచేవారు అలా ఉండగా ఒకనాడొక తుంటరి వారి విహారాన్ని చూడగోరి ఆదారిలో పొంచి ఉండి వారి తేరక్కడికి రాగానే కోడివలె కూసినాడట అపుడది వినగానే రధం రకీమని ఆగిపోయింది. ఇక కదలలేదు ఆ జ్ఞాపకంగానే శిల్పులాతర్వాత ఆరధం వెనుక యిపుడున్న గుడిగట్టి అందులో ఆది దంపతులను ప్రతి మారురూపాలతో నిల్పినారు జగన్నాధం గట్టుకు

పురవస్తుశాఖవారు ఆగర్భాలయాన్ని గూడ తరలించుకపోనుండగా ప్రజలడ్డుపడి దాన్ని మాత్రం నిలుపుకున్నారు కృష్ణ నిండితే యిపుడానీరు దాన్ని తాకుతుంది

ఆనాడు పామరులలోగాని, పండితులలోగాని ఏదో ఒక పురాణం పుట్టడమే ఆలస్యం శిల్పులు దానికి సాకార రూపమిచ్చి దాన్ని శాశ్వతం చేస్తు పోయినారు ఇది ఆనాడు వారు ప్రజలలో మొలకెత్తిన భక్తిని స్థిరంగా నిలుపటానికి చేసిన ప్రయత్నాలలో ఒకటి అనవలె

ఇక్కడి రాతినిండా ప్రతిమా శిల్పం ఉండటం చేత సామాన్యులా రథాన్ని రూపాల సంగమేశ్వరం అని వ్యవహరించినారు జగన్నాథం గట్టుపైకి తరలించిన ఈ ఆలయానికిపుడు చక్రాలు లేవు అవి పాదపీఠంలోనికి పోయినవి ఈ ఆలయంలోని శిల్పం సజీవమైన మూర్తులవలెనే అద్భుతంగా ఉంటుంది ముఖ్యంగా ఆలయద్వారానికి రెండు వైపులలో నిలిచిన స్త్రీమూర్తులను చూచినపుడు కళాపూర్ణోదయంలోని సురాష్ట్రుడు విశ్రాంతి తీసుకున్న ఆలయం తలపిస్తుంది

అసలైన సంగమేశ్వరం ఇక్కడికి రెండు ఫర్లాంగులుంటుంది అక్కడి శివలింగాన్ని మొదట బ్రహ్మదేవుడే ప్రతిష్టించెనట ధర్మరాజు వనవాసకాలంలో యిక్కడికి వచ్చి ఈ శివలింగాన్ని దర్శించినట్లు స్థలపురాణం చెబుతుంది దీనికి నివృత్తి సంగమేశ్వరమని పేరు రావటానికి గల పురాణకథ ఈ విధంగా ఉంది

పూర్వం కాశీ పట్టణంలో ఆయాచితుడనే యాయవర బ్రాహ్మణుడుండేవాడు అతడు చాలాకాలం బ్రహ్మచర్యం పాటించి గృహస్థాశ్రమ మాహాత్మ్యం విని వయసుడిగే దశలో కళ్యాణి అనే ఒక కులమింటి యువతిని వివాహమాడినాడు ఆమెనిండు యవ్వనంలో ఉండేది కాబట్టి యౌవనం దాటుతున్న పతితో ఆమెకు కామోప భోగం తీరకుండా ఉండేది

ఆమె దిన దినం గంగానదికి నీళ్లకు వెళ్లేది అపుడొకనాడు దారిలో ఒక పంచమ యువకుడు కనిపించినాడు వాడు నిండువయసులో ఉన్నాడు కాబట్టి అతని శరీర సౌష్టవం కళ్యాణి నాకర్షించింది కామం తలకెక్కినపుడు వ్యక్తి యుక్తాయుక్త వివేకం కోలుపోతాడు మానవుని హృదయంలో రామునికో కామునికో ఎవరికో ఒకరికే స్థానం కనుక ఆమె అతనితో కన్ను కలిపింది

నాటినుండి ఆమె దినదినం మంచినీటికి వచ్చినపుడతనితో కామకేళిని దేలి గంగకువెళ్లి మరల స్నానంచేసి మడినీళ్లు తీసికొని వెళ్లుతూ ఉండేది అట్లా ఆమె చండాలసంపర్కంతో

దినదినం గంగలో స్నానం చేస్తుండగా ఆ దోషం చేత గంగకు వాయస రూపం కలిగి ఆమె సత్యలోకం వెళ్ళి బ్రహ్మతో మొరపెట్టుకోగా ఆయన ఆనదితో ఓ గంగా ! పూర్వం ఒక కల్పంలో దక్షప్రజాపతి కృష్ణాతీరంలో యజ్ఞం చేయగా దాన్ని భంగం చేయటానికి వెళ్ళిన వీరభద్రుడక్కడ ఒక శిఖరంపై నిలిచినాడు

కొంతకాలానికి కృష్ణానది తన బంధు బలగంతో కూడి అక్కడగల కొండ అడ్డమై మొరపెట్టగా అదిచూచి వీరభద్రుడు విష్ణువును ప్రార్థించినాడు అంత అతని పంపున సుదర్శనం వచ్చి సుడి తిరుగుతు అక్కడ కొండను తొలిచి దారి చేసింది కాబట్టి సుదర్శన స్పర్శయైన ఆస్థలం కృష్ణానదిలో చక్రతీర్థమని ప్రశస్తి వహించింది అది సకల పాపహర స్థలం నీవక్కడ స్నానంచేసి నేను ప్రతిష్ఠించిన శివలింగాన్ని దర్శించు అక్కడ శివపార్వతులెపుడు సన్నిహితమై ఉంటారు వారి దర్శనంతో నీయొక్క యధారూపం మళ్ళీ కలుగుతుంది అని చెప్పినాడు అదివిని గంగ దినదినం కళ్యాణి తనలో స్నానంచేయగానే కాకి రూపంలో అక్కడికి వచ్చి చక్రతీర్థంలో స్నానమాడి సంగమేశ్వరుని దర్శించి హంసరూపాన్ని పొంది వెళ్లసాగింది

గంగాదేవి ఆవిధంగా దినదినం కాకి రూపంలో అక్కడికి వచ్చి హంసగామారి వెళ్ళుతూ ఉండగా దాన్ని గమనిస్తున్న ఒక మహర్షి ఒకనాడాకాకితో అమ్మా నీవెవరు ! దినదినం ఎందుకిట్లా వస్తున్నావు ? అని అడిగినాడు ఆపుడా కాకి తన వృత్తాంతం చెప్పింది అదివిని ఆ మహర్షికి గంగా దేవిపై జాలికలిగి నీయొక్క ఈ రూపానికి నిష్కృతిలేదా ! అని అడిగినాడు అపుడామె తండ్రీ ! ఎవరైనా ఆకళ్యాణి నిప్పటికైనా చండాల సంపర్కం మాన్పించి పతివ్రతను చేయగలిగితే నాయొక్క ఈ రూపం తీరి పోతుందని చెప్పింది.

అది విని అపుడా మహర్షి కాశికి వెళ్లి ఆయాచితుని యిల్లు తెలిసికొని ఆ ఇంటికి భిక్షకు వెళ్లి ఏకాంతంలో కల్యాణితో నాకు దివ్యదృష్టితో నీ దుర్వృత్తి తెలిసింది కనుక నేను నీ చేతి భిక్ష స్వీకరించను అనే వరకు ఆమె కన్నులు తెరచి తన తప్పు తెలిసికొని అతని పాదాలపై పడింది అపుడా మహర్షి ఆమెకు అరుంధతి, అనసూయ, సావిత్రి, సుమతి మొదలైన పతివ్రతల కథలు వినిపించి పాతివ్రత్య ధర్మం బోధించి చండాల సంపర్క నుండి మరలించి పునీతను చేసినాడు పై విధంగా యిక్కడ గంగాదేవి పాపం దినదినం నివృత్తి అయిపోతుండేది కాబట్టి దీనికి నివృత్తి సంగమేశ్వరమని వ్యవహార మేర్పడింది.

ఈ కథ నక్కడి మహర్షులు ధర్మరాజుకు చెప్పగా అది విని ఆయనకు గూడ అక్కడ ఒక శివప్రతిష్ఠ చేయవలెనని బుద్ధి పుట్టి భీముని ఒక శివలింగాన్ని తెమ్మని కాశికి పంపినాడు

కాని అతడు నిర్ణయించుకున్న ముహూర్తానికి రాలేక పోయినాడు అపుడక్కడ ధౌమ్యుడు మొదలైన పురోహితులు ధర్మరాజును తొందరించగా ఆయన అంతవరకక్కడ నరికి పడవేసిన వేపమొద్దొకటి ఉండగా దాన్నే లింగంగా అక్కడ ప్రతిష్టించినాడు ఆ ప్రతిష్టానంతరం భీముడు కాశినుండి శివలింగాన్ని తెచ్చి అన్నగారు చేసిన ప్రతిష్ట చూసి తాను తెచ్చిన దాన్ని కోపం కొద్ది ఏటిలోనికి విసరగా అది దేవద్రోణి అనే తీర్థంలో పడి ఒక రాతి చొరికలో గట్టిగా యిరుక్కొని నిలిచింది అపుడు ధర్మజుడు భీముని కోపాన్ని చూసి ప్రజలు నేటినుండి నీవు తెచ్చిన లింగాన్ని పూజించిన పిమ్మటనే నేను ప్రతిష్టించిన దాన్ని పూజిస్తారని అతన్ని శాంతపరచినాడు

ధర్మరాజుయొక్క ఆవచన ప్రకారం మొదట ప్రజలు దేవద్రోణిలో నిలిచిన భీమలింగాన్ని పూజించిన పిమ్మటనే ఆలయంలోని వేపలింగాన్ని పూజించేవారు

కాని దేవద్రోణి కృష్ణ గర్భంలో ఉండి ప్రవాహవేగంతో అక్కడికి వెళ్లిన వారిని లోపలికి లాగుతూ ఉండేది. అది చూసి పురోహితులపుడు మరోపెద్ద శివలింగాన్ని తెచ్చి స్నానఘట్టంలో మెట్లపై నిలిపి ప్రజలతో అదేభీమలింగమని చెప్పసాగినారు ప్రజలు గూడ ఏటిలోకి దిగలేక దానినే పూజించేవారు కాని యిపుడది అక్కడలేదు

కృష్ణగూడ యిపుడు దేవద్రోణిని విడిచి చాలా దూరం వెళ్లింది అందువల్ల వేసవిలో యిపుడు మనం దేవద్రోణిలోని శివలింగాన్ని చూడవచ్చు అది నేలలోపలికి ఎంత ఉందో కాని పైకి మాత్రం చిన్నగానే కనిపిస్తుంది

ఇపుడీ సంగమేశ్వరం వంటి దారుమయ శివలింగాలు కళింగంలోని మధూకేశ్వరాలయంలో ఒకటి, కలకత్తా దగ్గరి వైద్యనాథంలో ఒకటి ఉన్నవి. కళింగంలోని మధూకేశ్వరలింగం యిప్పమానుకాగా పర్లీలోని వైద్యనాథేశ్వరుడు వేపమొద్దుగా ఉన్నాడు.

ఈ సంగమేశ్వరంలో పాండవుల పేర అయిదు గుడులు ద్రౌపదిపేర ఒక దేవీ ఆలయం, అదిగాక శిఖరాలు లేనివి నాలుగు చిన్నగుడులు కూడ ఉన్నవి వీనిచుట్టుగల ప్రాకారానికి ఉత్తరం వైపు రాజగోపురం దక్షిణం వైపు మామూలు ద్వారం ఉన్నవి ఇక్కడి ఉత్తరగోపురాన్ని కొల్లాపురం ప్రభువులు కట్టించిరట సంగమేశ్వరం తరలింపు కార్యక్రమంలో ఈ ఆలయాలను పడగొట్టి మంచి మంచి రాతినంతా జగన్నాథం గట్టుకు తీసికు వెళ్లినారు

ఇక ఈ సందులో చుట్టు ప్రక్కల నారు గూడ తమ అవసరాలకొద్ది కొంత తరలించుకు వెళ్లినారు అయినా యింకా చాలా భాగం అలాగే ఉండి పోయింది

ఈ సంగమేశ్వరాని కల్లంత దూరాన మహాదేవుని పేర మరో ఆలయం ఉంది. సంగమేశ్వర ఆలయాలు కట్టిన పనివారు ప్రొద్దస్తమానం పని చేసి అగుడిముందుకు వెళ్లి ఇసుకకుప్ప చేసి - చేసికున్నంత వారికి చేసికున్నంత మహాదేవా ! - అని ఆ గుడిలోని స్వామికి మ్రొక్కగా వారికా యిసుక కుప్పలో వారికష్టానికి తగినంత కూలి లభించేదని ప్రజలు చెప్పుకుంటారు

ఈ సంగమేశ్వరానికి మరో రెండు ఫర్లాంగుల దూరాన భవనాశినీ తీరాన కపిలేశ్వరం అనే క్షేత్రం ఉంది



జటప్రోలు ఆలయ దృశ్యం దూరం నుండి

# సోమేశ్వరావిర్భావ పురాణం

మహర్షులలో వశిష్ఠ విశ్వామిత్రులిద్దరు పరా అపరావిద్యలకు ప్రతీకలు వారిలో ఒకరు బ్రహ్మర్షి మరొకరు రాజర్షి ఈ యిద్దరు సూర్యవంశానికి ముఖ్యులు విశ్వామిత్రుడు శ్రీరామునికి విద్యాగురువుకాగా వశిష్ఠుడు జ్ఞానగురువైనాడు అయితే వీరిద్దరికి ఋషిత్వ విషయంలో స్పర్థ ఉండేది విశ్వామిత్రుడంటె సామాన్యుడుగాడు ఆనాడు బ్రహ్మసృష్టికి ప్రతి సృష్టిచేయగలిగినంతవాడు కనుకనే నేనిన్ని విద్యలు నేర్చినాను కాబట్టి నేను బ్రహ్మర్షిని ఎందుకుకాను అని అతనివాదం

అతడొక పర్యాయం ''అసిపత్రివ్రతం'' అనగా చుట్టూమంగలి కత్తులవంటి వాడియైన కత్తులు నాటుకొని వానినడుమ కూర్చుని కఠినతపం చేసి ఎన్నో సిద్ధులు సాధించి ఇంద్రసభకు వెళ్లి తనను బ్రహ్మర్షిగా గుర్తించమని కోరినాడు అయితే సిద్ధులు పొందినంతమాత్రంలో బ్రహ్మర్షికాలేడు కనుక ఇంద్రుడు శాపభయంతో అతనితో ఆ మాట చెప్పలేక సభలో ఉన్న నారదుని వైపు చూడగా అతడు ''ఓ విశ్వామిత్రా ! బ్రహ్మర్షిత్వం నిర్ణయించగలిగిన వాడు బ్రహ్మనేగాని యీ యింద్రుడుగాడు కాబట్టి నీవు వశిష్ఠుని వెంటబెట్టుకొని బ్రహ్మదగ్గరకే వెళ్లు'' అని చెప్పినాడు

అది విని విశ్వామిత్రుడు వశిష్ఠుని వెంటబెట్టుకుని బ్రహ్మ దగ్గరకు వెళ్లి తనను బ్రహ్మర్షిగా అంగీకరించమని కోరగా బ్రహ్మగూడ యింద్రుని వలెనే సంశయించి సరేగాని నేను నిన్ను బ్రహ్మర్షిగా అంగీకరించినట్లు మధ్యవర్తులైన సాక్షులెవరైనా ఉండవలెగదా ! కేవలం నేనొక్కని అంగీకరించినంత మాత్రంతో సరిపోదుకాబట్టి నీవు వెళ్లి సూర్యుని, శేషుని, అగస్త్యుని పిలుచుకొని రమ్మని చెప్పినాడు

అంత విశ్వామిత్రుడు సూర్యుని దగ్గరకు వెళ్లి బ్రహ్మ ఆజ్ఞ చెప్పగా నేను ఇక్కడి నుండి కదిలితే లోకాలన్ని చీకటిలో మునిగిపోతవి కాబట్టి రాలేనన్నాడు శేషుని దగ్గరకు వెళ్లగా నాతలపై ఉన్న ఈ లోకాలన్ని తలక్రిందై పోతవి కాబట్టి నేను కదలలేనన్నాడు ఆ తర్వాత అగస్త్యుని దగ్గరకు వెళ్లగా నేనిక్కడినుండి వస్తే భూమి ఉత్తరంవైపు ఒడ్డిగిల్లుతుంది కాబట్టి రాలేను ఏమీ అనుకోవద్దు అని చెప్పినాడు

ఈ విధంగా బ్రహ్మసూచించిన వారంతా తమ అశక్తతను వెలిబుచ్చగా విశ్వామిత్రుడిక యేమి చేయలేక బ్రహ్మసభకు వెళ్లి ఆ విషయం చెప్పగా ఆయన వశిష్ఠుని అయితే నీవు వెళ్లి

ప్రయత్నించినాడు అని చెప్పినాడు అంత వశిష్టుడు సూర్యుని దగ్గరకు వచ్చి పిలువగా అతడు మొదటి సమాధానమే చెప్పినాడు అదివిని వశిష్టుడు నీవు తిరిగి వచ్చేవరకు నాశాటి నీ పని నిర్వహిస్తుంది రమ్మని తన అంగవస్త్రాన్ని అక్కడుంచినాడు పిమ్మట శేషుని దగ్గరకు రాగా అతడుగూడ మొదటి వలెనే చెప్పగా నీవు తిరిగి వచ్చే వరకు నీపని నా యోగదండం చేయగలదు రమ్మని దాన్ని అక్కడ నిలిపి వారిద్దరిని తోడ్కొని అగస్త్యుని దగ్గరకు రాగా అతడు మొదటివలెనే అన్నాడు అంత వశిష్టుడు నీవు తిరిగి వచ్చేవరకు నీ పని నాకమండలం చేయగలదురమ్మని దాన్ని అక్కడ ఉంచి ఆ ముగ్గురిని తోడ్కొని బ్రహ్మసభకు వచ్చినాడు అది చూచి బ్రహ్మ ఇపుడికనేను చెప్పవలసిందేముంది మీ యిద్దరిలో బ్రహ్మర్షి ఎవరో తేలిపోయింది గదా ! అన్నాడు - అదివిని బ్రహ్మయొక్క మాటకు ముఖం చిన్న బుచ్చుకుని విశ్వామిత్రుడు వెనుదిరిగి వచ్చినాడు అనంతరం సూర్యుడు, మొదలైనవారు తమ తమ స్థానాలకు యధావిధిగా వెళ్లినారు

సూర్యవంశంలో ఏబదవ మహారాజు మిత్రసహుడు పురాణాలలో అతడు కల్మాష పాదుడుగా ప్రసిద్ధుడు ఒకనాడతడు తమ యింటిలో పితృశ్రాద్ధం ఉండి వశిష్టుని భోజనానికి నిమంత్రించి నాడు ఆసంగతి విశ్వామిత్రునికి తెలిసింది అతని కేలాగైనా వశిష్టుని అవమానించవలెనని ఉండేది అందుచేత ఈ సమయం బాగుందని మహారాజు దగ్గరకు వెళ్లి మహారాజా నీవు క్షత్రియుడవు కాబట్టి వశిష్టునికి క్షత్రియ పద్ధతిలోనే భోజనం పెట్టుకాని శాకపాకాలతో వద్దని చెప్పినాడు అంత ఆ మహారాజు సూపకారుని పిలిచి మాంసభోజనం సిద్ధం చేయుమని చెప్పినాడు. అదివిని విశ్వామిత్రుడు రహస్యంగా సూపకారుని దగ్గరకు వెళ్లి మాంసాలలో మనుష్యమాంసం శ్రేష్టం దానికి మహామాంసమని పేర కాబట్టి నీవు వశిష్టుని కొరకు మహామాంసం సిద్ధం చేయి అని చెప్పినాడు

ఆ సూపకారుడు ఒక దానవుడు మిత్రసహుడొకపుడు వేటకు వెళ్లగా అతని కిద్దరు రాక్షసులడ్డు పడి అతని వేటను భంగం చేసినారు అపుడు మహారాజు కోపించి వారిపై బాణాలు వేయగా ఒకడు మరణించి, రెండవవాడు తప్పించుకొని పోయినాడు ఆ తప్పించుకొని పోయినవాడు తర్వాత ఆ రాజుగారిపై పగ తీర్చుకోవటానికి ఈ వంటలవాని రూపంలో అతని కొలువులో ప్రవేశించినాడు కాబట్టి వాడు తనపనికి ఈ సమయం చక్కగా ఉందని బయటికి వెళ్లి పట్టణంలో ఒకనిని పట్టుకొని చంపి అతని మాంసాన్ని వశిష్టునికొరకు వండినాడు

భోజనం కొరకు వచ్చిన వశిష్టుడు సూపకారుడు శాకపాకాలన్ని వడ్డించిన తర్వాత పరిషేచనం చేసి అన్నం పై నీరు ప్రోక్షించి దివ్యదృష్టితో చూచుకోగా అది మనుష్య

మాంసమని తెలిసింది అంత అతడు క్రుద్ధుడై ఆమహా రాజును నీవు నాకు మనుష్యమాంసం పెట్టించినావు కాబట్టి రాక్షసుడవై పొమ్మని శపించినాడు ఆ శాపంతో మిత్రసహుడు దానవుడై వసిష్ఠుని కుమారు లందరిని మ్రింగినాడు అపుడు వశిష్టుడు ఆదారుణానికంతా మూలమేమిటని ఆలోచించి దివ్యదృష్టితో మరల చూచుకోగా అదంతా విశ్వామిత్రుని పన్నాగమని తేలిపోయింది దానితో అతని పై కోపించి విశ్వామిత్రుని కుష్ఠువ్యాధి గ్రస్తుడవు కమ్మని శపించినాడు

ఆశాపంతో విశ్వామిత్రుడు కుష్టుగ్రస్తుడై దానితో వేగలేక సముద్రంలో పడగా సముద్రడతనికి ప్రత్యక్షమై కృష్ణానదిలోని చక్రతీర్థ మహాత్మ్యాన్ని వివరించి, వశిష్టుని శాపాన్ని త్రిప్పగలిగినవారు లేరు కనుక నీవు ఆ తీర్థానికి వెళ్లి దానిలో దినదినం స్నానంచేస్తు సహస్ర గాయత్రిని జపించమని చెప్పినాడు

అదివిని విశ్వామిత్రుడిక్కడికి వచ్చి యిక్కడ కృష్ణా తీరంలో ఉండే గాయిత్రీ తీర్థంలో గాయత్రిని ప్రతిష్ఠించి దినదినం తాను చక్రతీర్థంలో స్నానం చేస్తు ఆదేవి జపం చేసి కుష్టువ్యాధినుండి విముక్తిని పొందినాడు

అనంతరం అతనికి తననిన్ని పాట్లకు గురిచేసిన వశిష్టుని ఏ విధంగానైనా గెలువ వలెననే పట్టుదల కలిగి అక్కడనే అదే గుహలో మళ్లి కఠినమైన తపం ప్రారంభించినాడు అతడా విధంగా మరల తపస్సును ప్రారంభించేవరకు ఈతడవ యింద్రునికి భయం కలిగింది ఎక్కడ ఎవరు తపంచేస్తున్నా వారే విధంగా తనపదవికి భంగం కలిగిస్తారో, ఏ హిరణ్యాక్ష వరాలు కోరుతారోనని అతని భయం అందువల్ల అత డూర్వశిని పిలిచి నీవు వెళ్లి ఏ విధంగానైనా విశ్వామిత్రుని తపం భంగం చేసిరావలెనని ఆజ్ఞాపించినాడు అపుడామె ఈ పర్యాయం తనకు మన్మథుని వసంతుని తోడుపంపమని కోరక ''ప్రభూ ! మీ రక్కడ మొదట విశ్వకర్మను పిలిచి రెండు పట్టణాలు నిర్మించమని చెప్పి వానికి ప్రభువుల నేర్పరచి వారిద్దరికేదైన నెపంతో ఒక భీకరయుద్ధం కల్పించండి. అపుడక్కడ నా పని సులభ మౌతుంది'' అని కోరింది

అంత ఊర్వశి కోరిక ప్రకారం యింద్రుడు విశ్వకర్మను పిలిచి కృష్ణాతీరంలో చక్రతీర్థం దగ్గర రెండు పట్టణాలు సృజించమని చెప్పగా అతడు వచ్చి అక్కడి శ్వేతశిఖరి పై ఒకటి, రెండవ వైపున భానుక తీర్థం ఎగువన ఒకటిగా పట్టణాలు కల్పించినాడు అంతయింద్రుడా పట్టణాలకు సూర్యచంద్రులను ప్రభువులనూ పంపహా ఒక వ్యతీ పాతయోగంలో వారిద్దరు భయంకరమైన యుద్ధానికి దిగినారు

ఆపుడూర్వసి ఒకనాడు సామాన్య స్త్రీ వేషంతో విశ్వామిత్రుని గుహకు వచ్చి స్వామీ ! నా భర్త ఒక సేనాపతి, అతడీ యుద్ధంలో మరణించి నేననాథనైనాను యుద్ధం యొక్క అలజడితో అక్కడ నిలువలేక పోతున్నాను కొంతకాలం మీ గుహ సమీపంలో తలదాచు కుంటానని కోరింది విశ్వామిత్రుడామె మాటలు విని జాలిపడి సరేనని అంగీకరించినాడు అట్లా ఉండగా కొంత కాలానికి ఒకనాటి రాత్రి ఆమె యచటి క్రూరమృగ గర్జనలకు భీతిల్లినట్లు నటించి విశ్వామిత్రుని గుహలో ప్రవేశించి యతనితో పాటుగానే నిలిచింది పురుషుడు ఘృత భాండం, స్త్రీ అగ్నిగుండం అని భాగవతసూక్తి కాబట్టి స్త్ర సహచర్యంలో ఎంతటి వారికైనా కామనిగ్రహం కష్టం కనుక విశ్వామిత్రుడామెకు వశపడి పోయి కామకేళిని దేలసాగినాడు దానితో అతనికి కుష్టువు మళ్లీ ప్రారంభమయింది అపుడతడు కన్నులు తెరచి అది యింద్ర - ఇంద్రియ - మాయగా తెలిసికున్నాడు ఊర్వశి తాను వచ్చిన పని నెరవేరింది కాబట్టి కుష్టువు మిషతో అతనిని విడిచి వెళ్లింది ఆమె వెళ్లిన పిమ్మట అతడు మొదట కంటె శతాధికంగా మళ్లీ గాయత్రి జపం చేసి వ్యాధి నిర్ముక్తుడైనాడు - ఇంతటితో ఈ కథ కంచికి వెళ్లింది

ఈ కథలో ఆనాడు విశ్వకర్మతో శ్వేతశిఖరిపై నిర్మింప బడిన పట్టణమే ఈనాటి సోమశిల అంటారు అపుడక్కడ చంద్రుడు ప్రభువై పుట్టి తమ యిష్టదైవమైన శివుని పార్వతీ దేవితో సహా ప్రతిష్ఠించుకొని పూజించినాడట అందువల్ల ఆ దేవుని కపుడు స + ఉమ = సోమ, ఉమతో కూడిన ఈశ్వరుడు, సోమేశ్వరుడనే పేరు కలిగి అతడు వెలసిన క్షేత్రంగా అది సోమేశ్వరం అనబడింది స్థానిక వృద్ధులు సోమేశ్వరాన్ని సోమనాధుడనే ప్రభువు కట్టించినట్లు చెప్పుకుంటారు కనుక ఈ సోమనాధుడు పురాణకాలంనాటి ఆ చంద్రుడే కావచ్చు లేదా మరో ప్రభువు కావచ్చు, కృష్ణా తీరంలోని చంద్రగుప్తి పట్టణాన్ని పరిపాలించిన వారు సోమవంశీయులే కనుక ఈ సోమనాధుడు ఆ వంశంలో ఒకడు గూడ కావచ్చు

ఆనాటి సోమేశ్వరమే యిపుడు సోమశిలగా మారింది ఇపుడు కృష్ణాగర్భంలో మునిగిన ఈ సోమశిల ప్రక్కనే ఆనాడు విశ్వామిత్రుడు తపస్సు చేసిన గుహ ఉంది దానిలో యిపుడు నృసింహ ప్రతిష్ఠ చేయబడింది అందువల్ల అదిపుడు నృసింహకోన అంటున్నారు కృష్ణాగర్భంలో మునిగిన ఈ సోమశిలకు తూర్పున కిలోమీటరుపై రామమ్మ గుట్ట ఉంది దానిపై శివాలయం ఉండేది గుడి శిథిలంకాగా యిపుడా శివలింగాన్ని తెచ్చి సోమేశ్వరాలయంలో ఉంచినారు దక్షిణంలో రెండు ఫర్లాంగులపై నరసింహకోన ఉంది అందులో గూడ ఒక శివప్రతిష్ఠ ఉండేది ఉత్తరంగా ఒక కిలో మీటరు పై మర్లబావి ఉండేది అక్కడ గూడ రెండుగుడులు ఉండేవి కాని అవిగూడ యిపుడు శిథిలమైనవి

శ్రీశైల గర్భం కృష్ణాతీరం అయిన ఈ ప్రాంతమంతా ఎటుచూ చినా కొండలే వానిలో గల శివ ప్రతిష్ఠలకు లెక్కలేదని జానపదులంటారు ఇన్ని ప్రతిష్ఠలేయే కాలాలలో వెలసినవో ఎందుకు వెలసినవో చెప్పలేం

కాశి మొదలుకొని కన్యాకుమారి వరకు హిందువుల యొక్క ప్రతి ప్రసిద్ధ దేవాలయం దగ్గర ఎవరో ఒక మహమ్మదీయ మహాత్ముని సమాధి తప్పక చోటు చేసికున్నది ఇది ఆనాడు వారు చేసిన దండయాత్రలకు గుర్తుకావచ్చు లేదా వారువచ్చి నివసించిన దానికి చిహ్నంకావచ్చు ఇపుడు కృష్ణా గర్భంలోని సోమశిలలో సోమేశ్వరాలయం ప్రక్కన బాబా కమాలుద్దీన్ సాహెబ్‌గారి దర్గా ఒక పెద్ద మసీదు ఉన్నవి మహమ్మదీయుల మతప్రకారం హిందువులు ఆలయాన్ని మార్చిమరొకచోట కట్టినట్లు దర్గాలను తరలించరాదు కనుక దాన్ని వారలాగే వదలినారు ఈ దర్గాపై అరబ్బీ లిపిలో ఒక పెద్ద ఫలకంగూడ నిలిపి ఉంది ఈ బాబాగారు హి 1020 నాటి వాడని అక్కడివారంటారు కాని ఈయన బాబాకాదు ఇబ్రహీం కులీకుతుబ్‌షా గారి అల్లుడు గుంటూరు రాజులపైకి పోరాటానికి పంపబడి వీరమరణం చెందగా అతని కాయాన్ని తెచ్చి యిక్కడ కృష్ణాతీరంలో సమాధి చేసినారు

ఈ ప్రాంతంలో అచ్చంపేట తాలూకాలోని నిరంజన్‌వలీ, నాగర్‌కర్నూలులోని బాలేషహీద్ అనే వారుగూడ యోధులై వీరమరణం చెందినవారే ఇపుడు బాబాలై పూజలందుకుంటున్నారు ఇక్కడ కమాలుద్దీన్ గారి దర్గా దగ్గరగల శాసన ఫలకం 31½ X 16 అంగుళాలుంది దానిపై అతని వివరం ఉబ్బెత్తుగా చెక్కబడి ది



# చక్రతీర్థ మాహాత్మ్యం

ఇది కృష్ణా గర్భంలో ఎడమవైపు అగస్త్యేశ్వరానికి దగ్గరగా ఉంది ఉమా మహేశ్వర సంవాదంలోని శ్రీశైల ఖండంలో శ్వేతశృంగమనే పర్వతం ఒకటి చెప్పబడింది అదియిక్కడ మల్లెగుండు గట్టు అని పిలువబడే కొండనేయని ప్రాచీనుల యభిప్రాయం కృష్ణానది ఈ కొండనే తొలుచుకొని ఉత్తరావాహిని అయింది స్థలపురాణం ప్రకారం ఆనాడు సుదర్శనం ఈ కొండకు గండికొట్టటానికే యిక్కడికి వచ్చింది

ఇక్కడ నదిలో ప్రతి నీటి బిందువు కూడా సుడి తిరుగుతూనే ముందుకు సాగుతుంది అందుచేతనే దీన్ని చక్రతీర్థం అన్నారు చక్రతీర్థం నైమిశారణ్యంలో ఉంది అక్కడ ప్రవాహం సుడి తిరుగుతూ ఉండటం మనం అన్ని కాలాలలో గూడ చూడవచ్చు ఇక్కడ ఈ సుడి నదీగర్భంలో జ్యేష్ఠాషాఢాలలో చూడవచ్చు నదినిండుగా ఉన్నపుడు కనిపించదు

ఈ తీర్థం పితృకర్మలకు ప్రశస్తమైన స్థలం ఇక్కడ నిమజ్జనం చేసిన అస్థులు శిలారూపాన్ని పొందుతుంటవి కన్యాసంక్రమణంలో యిక్కడ పితృకర్మలు నిర్వహిస్తే ఆపితరులకు అక్షయమైన పుణ్యలోక ప్రాప్తి కలుగుతుంది

ఇక్కడ ఉండే పంచేశ్వరాలలో ఏస్వామిని దర్శించినా వారి చక్రతీర్థంలోనే స్నానం చేసి ఆ దేవుని దర్శించవలసి ఉంది

ఈ తీర్థంలో స్నానం చేసి సిద్ధేశ్వరుని పూజించిన వారికి సర్వసిద్ధులు సులభంగా కలుగుతవి ఇందులో స్నానం చేసి సిద్ధులు పొందియే యిక్కడ కపిల మహర్షి తనపేర కపిలేశ్వరాన్ని ప్రతిష్ఠించి నట్లు పురాణవచనం

విశ్వామిత్రుడు ఈ తీర్థంలో స్నానం చేసియే తన యొక్క కుష్టువ్యాధినుండి విముక్తుడైనాడు

ఈ తీర్థంలో స్నానమాడి సంగమేశ్వరుని దర్శించియే, ఆయాచితుని భార్యయైన కల్యాణి చండాల సంపర్కంతో పొందిన పాపాన్ని భరించిన గంగా దేవి దినదినం పాపవిముక్త అయింది ఈ విధంగా స్థల పురాణంలో ఈ తీర్థరాజానికి చాలా ప్రశస్తి ఉంది

ఆనాడు అగస్త్య మహర్షి గూడ ఈ తీర్థంలో స్నానం చేసియే దీని తీరంలో తనపేర అగస్త్యేశ్వరాన్ని ప్రతిష్ఠించినాడు యిక్కడ ఆయన ప్రతిష్ఠించిన శివలింగాన్ని దిన దినం అర్ధరాత్రివేళ దేవతలు వచ్చి స్వామిని మల్లెపూలతో పూజించి వెళ్లుతుంటారట అందువల్ల ఈ స్వామికి మల్లేశ్వరుడని మరోపేరు నిలిచింది అంటారు

ఎవరైనా యిక్కడ చక్ర తీర్థంలో మూడు వేళలా స్నానం చేస్తూ అగస్త్యేశ్వరుని భక్తితో అర్చిస్తు ఆ ఆలయంలోనే నిద్రిస్తే అర్ధరాత్రి వేళ వారికి మల్లెపూల వాసన వచ్చేదట దీన్ని స్వానుభవంతో చూచిన వారున్నారు కాని ఇపుడగస్త్యేశ్వరం ఇక్కడలేదు

ఈ చక్ర తీర్థానికి తూర్పున చక్ర నారాయణ మని మరో తీర్థం ఉంది దానిలో స్నానం చేసి యిక్కడ విశ్వామిత్ర గుహలో ఉన్న నృసింహుని పూజించిన వారికి విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది

ఈ తీర్థానికి తూర్పు తీరంలోనే నరసింహునికోన ఉంది అక్కడ రంగనాధుని ఆలయం కూడా ఉంది కాని ఈనాడక్కడ ఉండే నృసింహ - రంగనాధాలయాలు రెండు శిధిలమైనవి

సోమేశ్వరం గూడ మొదట ఈ చక్రతీర్థ సమీపంలోనే ఉండేది శ్రీశైలంలోని డాం నిర్మాణం వల్ల అదిపుడు ఎగువన నిర్మించ వలసి వచ్చింది



# స్థానిక చరిత్రలో సోమేశ్వరం

ఇక్కడ కృష్ణాతీరం వెంట ఉన్న గ్రామాలన్నింటికి ఈశ్వరాలయాలనియే వ్యవహారం బొల్లారానికి మొగులేశ్వరమని పేరు అక్కడి స్వామి మొగులేశ్వరుడు అమరగిరికి అమరేశ్వరమని వ్యవహారం అంకాలేశ్వరి అమరేశ్వరులక్కడి దేవతలు ఈస్వామికి ముక్తి అమరేశ్వరుడని మరోపేరు మంచాలకట్టను మాంచాలేశ్వరం అనేవారు మాధవస్వామి మల్లికార్జునులు అక్కడి దైవాలు రామతీర్థానికి రామేశ్వరమని వాడుక అక్కడి స్వామి రామేశ్వరుడు జటప్రోలుకు జటేశ్వరమని పేరు అక్కడి స్వామి జటేశ్వరుడు

పూర్వం యిక్కడ గూడ ఒక మహేశ్వరం ఉందేది పార్వతి ఉమా ఉమామహేశ్వరు లక్కడి దేవతలు, ఇపుడిది అగస్త్యేశ్వరంలో కలిసి పోయింది

అగస్త్యేశ్వరం మల్లేశ్వరం అనే రెండు క్షేత్రాలు ఏకం చేసి యిపుడు గోపాలపురం దగ్గర పునర్నిర్మించబడినవి ఆ సముదాయంలో రుద్రుని యొక్క ఏకాదశ మూర్తులా అన్నట్లు అగస్త్యేశ్వర - ఉమామహేశ్వర - కాళేశ్వర - గంగాధరేశ్వర - భీమేశ్వర - మల్లేశ్వర - రాజరాజేశ్వర - రామలింగేశ్వర - విశ్వేశ్వర - శంభులింగేశ్వర - సాంబశివ అనేపేర్లతో విడివిడి శివప్రతిష్టలున్నవి ఇవిగాక ఇంకా భైరవ - వీరభద్ర - దేవీ ఆలయాలతో పాటు దానిలో అనంత పద్మనాభ స్వామి ఆలయం కూడా ఒకటి ఉంది

ఆంధ్రదేశంలో అగస్త్యేశ్వరం - సంగమేశ్వరం - సోమేశ్వరాలు చాలా ఉన్నవి శ్రీశైలానికి అష్టద్వారాలలో స్కందసోమేశ్వరం, సోమశిలా సోమేశ్వరం అని ఒకే పేర రెండు క్షేత్రాలున్నవి ఇవిగాక ఈజిల్లాలోనే అచ్చంపేట తాలూకాలోని అప్పర్ ప్లాటుపై మరో సోమేశ్వరం ఉంది

స్కందసోమేశ్వరం పెన్నానదీ తీరంలో కడప, నెల్లూరు పట్టణాల నడుమ ఉంది అది స్కందుడనే మహర్షి చేత ప్రతిష్ఠింప బడినట్లు స్థలపురాణాలు చెబుతవి అది శ్రీశైలాని కాగ్నేయ ద్వారంకాగా సోమశిలాసోమేశ్వరం నైఋతి ద్వారంగా చెప్పబడుతుంది ఇక్కడి ప్రధానాలయంలో మూడు తెల్లరాతి పానవట్టాలు అమర్చి శివలింగ ప్రతిష్ఠ చేయబడింది ఆ తెల్లరాయి కారణంగా దీన్ని సోమేశ్వర మన్నారని స్థానికుల మతం ఇది సప్త నదీ సంగమ స్థానం ఈ క్షేత్రాధి దేవత దుర్గాదేవి ఆమెకు రాజరాజేశ్వరి అని మరోపేరు ఇక్కడి క్షేత్రపాలకుడు భైరవుడు

కృష్ణవేణి, తుంగభద్ర అలంపురం సమీపంలోని కూడలి దగ్గర కలిసినవి అక్కడివారు కృష్ణవేణిని విష్ణురూపంగా తుంగభద్రను శివరూపంగా భావిస్తారు వానికక్కడ 'కుందేరు' అనే మరో చిన్ననది కలిసి అది షణ్ణదీ సంగమం అయింది దాన్ని ప్రజలు 'చిన్న సంగెం' అంటారు బసవేశ్వరుడీ చిన్న సంగెం దర్శించినాడట ఆయన లింగైక్యం పొందిన స్థలం కప్పడి సంగమం అది భీమా ఘటప్రభా సంగమ స్థానంలో ఉండి యిపుడు 'హిప్పరగె' డాం లోనికి వెళ్లింది

కూడలి నుండి కృష్ణాతుంగలు కలిసి ముందుకు సాగగా వానికి సోమశిల దగ్గర 'భవనాశిని' కలుస్తుంది అది పశ్చిమ వాహిని కాబట్టి పరిమాణంలో చిన్నదైనా అది 'నదం' అనబడింది సంస్కృతంలో నదీ శబ్దం స్త్రీలింగం నదం పుంలింగం కనుక భవనాశిని యిక్కడ ఆరుగురు కన్యలను వివాహమాడిన పురుషునిగా చెప్పబడి ఈ కళ్యాణంపై ఒక హరికథ గూడా వెలసింది అది బెక్కెం నివాసి బలహరిసింగ్ రాకూరు రచించినాడు

ఈ ఏడు నదులిక్కడ ఒక కొండను భేదించుకొని దాటిపోయినవి ఆ సంఘటన కిక్కడొక స్థల పురాణం అతుకబడింది

నివృత్తి సంగమానికి తూర్పున యజ్ఞేశ్వర ముంది అది దక్షప్రజాపతి యజ్ఞవేదికగా, దానికుత్తరంగా 1500 అడుగుల ఎత్తుగల కొండపై నిలిచిన వీరభద్రుడా యజ్ఞసందర్భంలో యిక్కడికి వచ్చిన వాడుగా ప్రజలు చెప్పుకుంటారు అతని నిపుడు పిడిగుండ్ల వీరభద్రుడని పిలుస్తారు విష్ణుమూర్తి అతని ప్రార్థన పైననే యిక్కడికి కొండను తొలువటానికి తన చక్రాన్ని పంపెనట

కృష్ణవేణీమతల్లి ముక్కుపోగు ఈపిడిగుండ్ల వీరభద్రుని దగ్గర ఉందట ఆనదీమతల్లి దాన్ని తెచ్చుకోవటానికి అతని దగ్గరకు వెళ్లిననాడీ కలియుగం మునిగి పోతుందట ఇది జానపదులు చెప్పుకునే మాట

కృష్ణవేణి తన బలగంతో కూడి చక్రంతో పాటు సుడి తిరుగుతూ కొండను దాటింది కాబట్టి ఈ స్థలానికి చక్రతీర్థమని వ్యవహారమేర్పడింది

ఇక్కడి కృష్ణానది కొండనుభేదించుకొని పోవటానికి జానపదులు చెప్పుకునే కారణం వేరు బోనాసి యిక్కడి వచ్చేవరకు ఆరునదులు కలిసి కొండ అడ్డంగా ఉండటం వల్ల ఎటూ వెళ్లలేక త్రొక్కులాడుతున్నవట అదిచూసి బోనాసికుంచు కుండెడు నీళ్లది అది

ఎంత దాని శక్తి ఎంతగాని నరాలబలం కలవారు మీరైదుగురున్నారు గదా ! ఓపట్టు పట్టండి అని వాటిని పురికొల్పిందట అపుడవి అన్ని కలిసి ఒక్కుమ్మడిగా విజృంభించగా ఎదురుగా నిలిచిన కొండదొర గుండె పగిలి వానికి దారి యిచ్చినాడట ఇట్లా యిక్కడిది పురుషకారానికి స్త్రీశక్తికి ఒక ఉదాహరణగా నిలిచింది

గోదావరి పాపికొండలను, పెన్నానది వెలిగొండలను చీల్చుకొని దాటినట్లు ఇక్కడ కృష్ణానది మల్లె గుండు గట్టును కోసుకొని దాటింది ప్రకృతి సిద్ధంగా కొండల వరుస తెగి లేదా ఏదో కారణం చేత కొండలు పగిలి ఆనడుమగుండా ఏర్పడిన లోయ దారులను కనుమలంటారు ఇవి ప్రకృతిలోని మనోహరమైన దృశ్యాలలో ఒకటి

సంకీర్తనాచార్యుడైన అన్నమయ్య అలివేలు మంగమ్మను
సొంపుల నీవదనము సోమశిల కనుమ
ఇంపులెల్ల చేకొనగ యిల్లు నీ పతికి పల్లవి సం 10-115

అని ఆమె ముఖాన్ని నెల్లూరి దగ్గరి సోమశిల కనుమతో పోల్చినాడు అన్నమయ్య మహాకవి కనుక ఆయన ఆనాడాలపించిన ఈ పల్లవి ఈ నాడు మన సోమశిలలోని లలితా దేవికి గూడ సరిపోతుంది

పండితారాధ్యుని శిష్యుడు దోనమయ్య గురువుగారి యొక్క మొక్కులు చెల్లించటానికి వెల్లగొండ నుండి శ్రీశైలం వెళ్లగా మల్లికార్జునుడతనికి వృద్ధ జంగమ రూపంలో దర్శనమిచ్చి ఒక శిఖరమెక్కించి అగస్త్యుడు వ్యాసమహర్షికి భీమఖండ దర్శనం చేయించినట్లు త్రింశద్యోజనపరితమైన శ్రీగిరిక్షేత్ర దర్శనం సోమశిలాది ఉమామహేశ్వరాంతంగా చూపినట్లు పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో తెలిపినాడు కాబట్టి ఈ విధంగా ఈ సోమశిలా ప్రసక్తి పురాణాలు మొదలుకొని కావ్యాలపైనుండి పదకవితల వరకు అక్కడక్కడ ప్రాకులాడే వచ్చింది

ఈ క్షేత్రం యిపుడు మన జిల్లాలోని కొల్లాపురం తాలూకాలో ఉంది సోమశిలనుండి కొల్లాపురానికి ఇపుడుండే దారికి పూర్వం కాలిబాట దానికి గాడిదలబాట అనిపేరు

వైష్ణవ వాఙ్మయింలో లిరుమంత్రం కథ ప్రసిద్ధం పూర్వం ''కురుంగుడి'' అనే గ్రామంలో మాధవ దాసు అనే వైశ్యుడుండెనట అతనికి బాల్యం లోనే తల్లిదండ్రిగిలించి దిక్కులేని వాడై యాత్రలు తిరుగుతూ తిరుగుతూ గంగా తీరంచేరి అక్కడొక గురువు

నా(శయించగా ఒకనాటి సంహారం ౦గురువుగారు యమునా తీరంలో శిష్యుని దాహం తెమ్మని పంపి అతడు తెచ్చే లోపల తిరుమంత్రం అచటి యిసుకలో వ్రాసి మరణించెనట ఈలోపల ఒక ఈటెసాని ఆ దారిని తనగాడిదల మందతో వచ్చి ఆ తిరుమంత్రాన్ని ఒక తాటి యాకుపై వ్రాసికొని దానిని చెరిపి వెళ్లెనట అనంతరం మాధవ దాసు జలం తీసికొని వచ్చి గురువుగారు పరమ పదించి ఉండటం, ఆయన అక్కడ వ్రాసిన తిరుమంత్రాన్ని ఈటెసాని తాటి యాకుపై వ్రాసికొని పోవటం ఆసమీపంలోని పశుకాపరులతో విని అతడు వెళ్లి గురువు గారి మంత్రం కొరకై ఆదొమ్మరసాని నా(శయించెనట అపుడా దొమ్మరి గుంపు దేశాన్ని తిరుగుతూ తిరుగుతూ ఈ సోమశిలా మార్గంగానే చోళదేశం వెళ్లెనని ఆమెగాడిదల మంద ఈదారిన వెళ్లినందుకే సోమశిల దారికి గాడుదుల బాట అని పేరేర్పడెనని ఒక దంతకథ ఇక్కడ వినిపిస్తుంది

పూర్వం ఈ చక్రతీర్థం దగ్గర ఎల్లపుడూ ప్రేతబంధువులు తమవారి అస్తినిమజ్జనాలు చేస్తు వారికిక్కడనే శ్రాద్ధ తర్పణాలు ఎక్కువగా చేస్తుండే వారని చెబుతారు హిందువుల శ్రాద్ధ విధిలో కాకి నివేదనం ఒక అంగంగా ఉంది కాకి మనవారికి యమదూతలకు పితృదేవతలకు చిహ్నం కనుక ఆకారణంగా అపరకర్మలో కాకులకు అన్నంపెట్టడం ఒక ఆచారంగా నిలిచింది అపుడు కాకులు అన్నం ముట్టకుంటే ప్రేత బంధువులది తమకేదో కీడుగా గూడా శంకిస్తారు

ఈ చక్రతీర్థం దగ్గర పూర్వం అపరకర్మలెక్కువగా జరుగుతూ ఉండటం చేత కాబోలు కాకులు విస్తారంగా నివసిస్తు అవి అపుడపుడిక్కడి మడుగులలో జలకాలాడుతుండేవట కాకులలో అరుదుగానైనా తెల్లవి లేకపోలేదు కాబట్టి ఆ కాలంలో ఎపుడైనా ఇక్కడికి తెల్లని కాకి కూడా వచ్చిందేమో ! బహుశః ఇదియే తర్వాత గంగాదేవి కథగా రూపుకట్టవచ్చు

స్థానికులిక్కడి ఆలయాన్ని సోమనాథ ప్రభువు కట్టించినట్లు చెబుతారు అతడెవరయింది వారికి తెలియదు బహుశః అతడు సంగమేశ్వర స్థల పురాణంలో చెప్పబడినట్లు ఆనాడింద్రుడు పుట్టించిన చంద్రుడు కావచ్చు లేదా కృష్ణానది కీవల చంద్రగుప్తికోట ఉంది దాన్ని సోమవంశీయులే పాలించినట్లు పండితారాధ్య చరిత్ర చెబుతుంది దాన్ని పాలించిన చంద్రగుప్తుని కూతురైన చంద్రవతియే శ్రీశైలంలోని వృద్ధ మల్లికార్జుననికి ఆలయప్రాకారాలు కట్టించిందని అంటారు కాబట్టి యిక్కడ ఈ ఆలయాన్ని ప్రతిష్ఠించిన సోమనాథుడు ఆ వంశానికి చెందిన ఒకానొక ప్రభువు కావచ్చు ఈ వంశం జల్లపల్లి యుద్ధంలో అశీతి వరాల సింగమ నాయని కుమారుని చేత నిర్మూలం చేయబడింది

శ్రీశైలం కృష్ణానదికి ఆనుకుని వేయుటం వల్ల కొల్లాపురం తాలూకాలోని చాలా గ్రామాలు ముంపుకు గురియైనవి అందుచేత వాని నక్కడినుండి సురక్షిత ప్రాంతాలకు తరలించే ప్రయత్నంలో ప్రభుత్వం యిక యిక్కడ చిన్నమర్రూరు, అగస్త్యేశ్వరం, సోమశిల ప్రాంతాలలో త్రవ్వకాలు నిర్వహించింది అపుడు వానిలో బయిల్పడిన వస్తుసామగ్రిని బట్టి ఈ ప్రాంతంలో క్రీస్తుపూర్వం ఎంతో మొదలే చరిత్ర ప్రారంభమైనట్లు తెలుస్తుంది

శ్రీ కోట వేంకటాచలం గారు కలియుగ రాజవంశాలనే గ్రంథంలో ప్రమర వంశ ప్రభువులు శకుల దాడికి ఉజ్జయినిని విడిచి క్రీ పూ 377 నుండి 182 వరకు శ్రీశైలంలోనే ఉండి రాజ్యం చేసినారని చెప్పినాడు

పురాతన వృద్ధులు తెలుగు దేశంలోని నందిమండలం నందరాజుల కాలంనాటిదని కథలు చెప్పేవారు మగధ సామ్రాజ్యకాలంలో దీని ఉనికి ఎట్లా ఉన్నదో తెలియదు కాని శాతవాహనుల కాలంలో 'శ్రీధానం' అనేపేర శ్రీశైలం వారి రాజ్యంలోనే ఉన్నది

వారి పిమ్మట వచ్చిన ఇక్ష్వాకులు తమను శ్రీపర్వతీ యాంధ్రులమని చెప్పుకున్నారు వారు మహాసేనాని భక్తులు కనుక తెలుగు దేశంలోని కుమారస్వామి ఆలయాలకు ఈకాలంలోనే శ్రీకారం చుట్టబడింది ఇక్ష్వాకుల కాలంలో వీరపురుషదత్తుడు బౌద్ధాన్ని అవలంబించి శైవాన్ని తిరస్కరించినాడు అపుడు శ్రీశైలంలో బౌద్ధులకు శైవులకు పెద్ద ఘర్షణ జరిగి ఆ పోరాటంలో ఉభయ మతాల సంస్కృతులు నాశనమైనవి ఆనాడు శ్రీశైలంలో జరిగిన ఆ మతవిప్లవ ప్రభావం దాని ద్వారాలు, అనుబంధాలు అయిన యితర క్షేత్రాలపై గూడ అంతోయింతో పడిఉండక పోదు

ఇక్ష్వాకుల పిమ్మట వచ్చిన విష్ణుకుండినులు తెలంగాణం అందునా మహబూబ్‌నగర్ జిల్లా ప్రక్కనుండియే అభ్యుదయమంది ఆంధ్రదేశం వరకు వ్యాపించినారు వారు తమను శ్రీపర్వత పూర్వాపరక్షితిపతుల మని చెప్పుకున్నారు వీరుగూడ శాతవాహనులవలెనే వైదిక మతావలంబులు

ఆంధ్రదేశంలో ఆలయ ప్రారంభం ఇక్ష్వాకుల నుండియే జరిగి విష్ణుకుండినుల కాలంలో విస్తరించింది అంతేకాక ఆనాటి నుండియే ఆలయాలకు ప్రతి సంస్కారం గూడ ప్రారంభమైనట్లు శాసనాల వల్ల తెలుస్తుంది ఇక్ష్వాకుల నాటి బౌద్ధ శిల్పులు ఈనాటికి క్రమంగా వైదిక శిల్పులుగా మారసాగినారు విష్ణుకుండినుల తర్వాత వచ్చిన పల్లవులు ఆ తర్వాత చాళుక్యులు పూర్తిగా వైదిక మతానుయాయులు వారు తమను మాతృగణ

పరిపాలించుం మని చెప్పుకున్నారు ఎన్నో శివకేశవాలయాలు నిర్మించినారు ఈ చాళుక్యుల కాలంలోనే ఊరూరా మాతృకా మూర్తులు నగరాలలో పెద్దపెద్ద గణపతి మూర్తులు వెలసినవి సంగీత ప్రపంచంలో తొలి నుతులందుకొనే వాతాపి గణపతి ఈకాలంలోనే వెలసినాడు

పశ్చిమ చాళుక్యుల పూర్వచాళుక్యులు, కళ్యాణీ చాళుక్యులు, బాదామీ చాళుక్యులు అనివ్యవహారాలు, రెండవ పులకేశి ఇందుపూరు శాసనంలో చాళుక్యవిషయం పేర్కొన బడింది దాన్ని పరిష్కరించిన శ్రీ వేపా రామేశం పంతులుగారు ఆనాటి చాళుక్య విషయం నేటి మహబూబునగర్ రాయలసీమలకే పరిమితమై యుండెనని అభిప్రాయపడినారు

ఈ జిల్లా వారిజన్మభూమి కనుక వారి శాసనా లిక్కడ ఎక్కువగా వచ్చినవి ఆలాగే వారి నిర్మాణాలు కూడా యిక్కడనే యెక్కువ జరిగినవి అయితే చాళుక్యులు గూడ ప్రారంభంలో జైనులే అందుచేత మహబూబునగర్ జిల్లాలో మొదటి దశలో జైనాలయాలే ఎక్కువగా వెలసినవి ఆ అవశేషా లిప్పటికి రామగిరి, ఇంద్రకల్లు, గోదలు, పోలెపల్లి గ్రామాలలో కనిపిస్తుంది మూర్తి నిర్మాణకళ, ఆలయ నిర్మాణ కళ మొదటగా ఈజిల్లాలో వారినుండియే మొదలయింది

ఈ ఎంశంలో కీర్తివర్మ తర్వాత తెలుగు దేశం రాష్ట్రకూటుల వశమయింది వారు జైనులు ఈ కాలంలో మహబూబునగర్ జిల్లాలో ఇంద్రకల్లు, పోలెపల్లి పెద్ద జైన క్షేత్రాలుగా వర్ధిల్లినవి ఈ ప్రభువులు వర్షాభిధానులు కనుక వరుణారాధకులని కొందరిమతం వరుణుడు వైదికదైవం పురాణాలలో త్రిమూర్తులను పరీక్షించిన భృగు మహర్షిది కావ్య నిర్మాత వాల్మీకి వరుణ పుత్రులుగానే చెప్పబడినారు

పాలమూరు జిల్లాలో మొదటి దశకు చెందిన గుడులలో జైనాలయాలే ఎక్కువ ఈ జిల్లాలో సుందరమైన దిగంబర జైనమూర్తులు చాలా వెలసినవి జటప్రోలు సమీపంలోని సింగోరంలోని దిగంబర మూర్తిని పురాతత్వ శాస్త్రజ్ఞులు పార్శ్వనాథ మూర్తిగా గుర్తించినారు కాని ప్రజలు దాన్ని భైరవునిగా పూజిస్తున్నారు

జైనులకు నాభి పుత్రుడైన ఋషభుడు ఆదిదైవం అతని చిహ్నమైన వృషభం శైవంలో శివుని వాహనమైన నంది అయింది వారి దిగంబర మూర్తులు భైరవులైనారు ఈ మార్పు కాకతీయుల కాలంలో ఎక్కువగా జరిగింది వారు మొదట జైనులే అయినా అనంతర కాలంలో దాన్ని చాలా నిర్దాక్షిణ్యంగా అణచివేసినారు

ఈనాడు తెలంగాణంలో కత్తి, ఢాలు ధరించిన నరనాగమూర్తులు, తలలపై పెద్ద పెద్ద సిగలతో, మెడలో రుద్రాక్షమాలతో చేతిలో ఏదో ఒక ఆయుధంతో కనిపించే వీరశిలలు ప్రతిగ్రామంలోను ఒకటి అరా తప్పక దర్శన మిస్తుంటవి ఈనాడు మన గ్రామాలలో ఒకటి- అరా - నాగమూర్తులుండని ఊరుండదు ఈ నరనాగమూర్తులు ఊర్ధ్వకాయం మానవాకారంగా, అధః కాయం సర్పాకారంగా ఉండి తలపై మూడు లేదా అయిదు పడగలతో ఒక చేతకత్తి, ఒకచేత ఢాలు ధరించి ఉంటారు

ఇపుడు మనగ్రామాలలో జానపదులు 'నరసప్ప' అనే దైవాన్ని చాలామంది పూజిస్తుంటారు ఈ నరసప్ప పేరు 'నరసర్ప' రూపమేనని కర్నూలు నివాసి హీరాలాల్‌గారు అభిప్రాయపడుతున్నారు

తెలంగాణంలోని పల్లెలలో ఈ నరసప్ప మూర్తులే గాక తలపై పెద్దపెద్ద శిగలతో కత్తి శూలం లేదామరేదో ఒక ఆయుధంతో వీరులు కనిపిస్తుంటారు వారందరూ ఆనాడు క్రొత్తగా శైవం స్వీకరించిన వీరులనవలె ఆవీరగల్లులను బట్టి ఆనాడు మన సమాజంలో జైనశైవాలు ఎంతగా వ్యాపించి ఉండెనో ఊహించవచ్చు

రాష్ట్రకూటులు 220 సంవత్సరాలు తెలంగాణా భాగాన్ని ఏలినారు

రాష్ట్ర కూటుల కాలంలో కుంజరయూథంబు దోమకుత్తుక సొచ్చినటుల అంతవరకు చక్రవర్తులుగా ఉన్న చాళుక్యులు వారికి సామంతులై ఒదిగి పోయినారు ఆవంశ ప్రతిష్ఠను మళ్లీ తైలప చక్రవర్తి రాష్ట్రకూటవంశంలోని కర్కరాజు నోడించి పునఃప్రతిష్ఠించినాడు ఈ సుదీర్ఘకాలంలో చాళుక్యులలో తూర్పుపడమరల తారతమ్యం ఏర్పడింది

పశ్చిమ చాళుక్యులకు బాదామి పిమ్మట తెలంగాణంలో మహబూబునగర్ జిల్లాలోని గంగాపురం రెండవ రాజధానిగా దానికి ఆఏంచ, కందూరు శాఖానగరాలుగా ఉన్నవి

ఈ చాళుక్య వంశంలో జగదేకమల్ల, త్రైలోక్యమల్ల, త్రిభువన మల్ల, భూలోకమల్ల చక్రవర్తులు తమపేర్లకు తగినట్లు ఎంతో శౌర్యమూర్తులు వారిరాణులు, రాకుమారికలు, సామంతులు, దండనాధులు ఈ జిల్లాలో ఎన్నో గుడులు కట్టించినారు అంతవరకున్న వాటికిని ఎన్నోదానాలు చేసినారు

ఇపుడు కృష్ణాతీరంలో కనిపించే అగస్త్యేశ్వరం, మల్లేశ్వరం, బెక్కేశ్వరంలోని మూకగుళ్లు తుంగభద్రాతీరంలోని అలంపురం, పాపనాశం అనేవి కేవలం ఒకొక్క

గుడియేకాదు, ఒక్కొక్కటి ఒక ఆలయ సముదాయం ఈ సముదాయాలన్ని చాలావరకు చాళుక్యుల కాలంలోనే ప్రారంభింప బడినవి లేదా రూపుదిద్దుకున్న వనవచ్చు

ఇదంతా శ్రీశైలానికి పశ్చిమ భాగం వాస్తుశాస్త్రాన్ననుసరించి ఇంటిలో దక్షిణ పశ్చిమాలు బరువులుండవలసిన స్థలాలు కనుక దాన్ననుసరించియేనేమో శ్రీశైలానికి దక్షిణ పశ్చిమ ప్రాంతాలైన ఈక్షేత్రాలను ఆలయ సముదాయాలతో నింపినారని పిస్తుంది

ఇక్కడి మల్లేశ్వరం మల్ల బిరుదాంచితులు, సోమేశ్వరం సోమేశ్వర బిరుదాంచితులైన ప్రభువుల పేరనే రూపుదిద్దుకొనవచ్చు ననిపిస్తుంది అంతేకాదు ఈసోమేశ్వర ప్రభావం నల్లగొండ జిల్లాలోని పానగల్లులో వెలసిన ఛాయా సోమేశ్వరాలయం పచ్చల సోమేశ్వరాలయంపై గూడ ఉండవచ్చు

అక్కడి ఛాయాసోమేశ్వరాలయంలో వూర్మిక శిల్ప వుండగా పచ్చల సోమేశ్వరాలయంలో నిండుగా ప్రతిమా శిల్పం వెల్లివిరిసింది దానిలో భారత భాగవతాలు, ఆనాటి నాట్యరీతులు మరెన్నో చోటు చేసికున్నవి

ఇకదైవంగా చూసినపుడు గద్వాల ప్రభువుల యొక్క తొలి దైవం కూడ సోమేశ్వరుడే ప్రోలుకంటి సోమేశ్వరుని పేరు పెట్టుకొనియే ఆ వంశంలోని సోమనాద్రి, సోమభూపాలురు ప్రసిద్ధికెక్కినారు

ఈ విధంగా యిక్కడ సోమేశ్వరుని ప్రభావం చాలా కనిపిస్తుంది ఈ ఆలయ సముదాయాన్ని పైకి తరలించినపుడిక్కడ శ్రీ రాయనిపల్లి విశ్వనాధాచారిగారు స్థపతిగా వ్యవహరించి లవణ మహాయజ్ఞం చేసి పునః ప్రతిష్ట చేసిన మూర్తులకు కళాకర్షణ గావించినాడు. ఆ సందర్భంలో ఆయన అన్నదానంగూడ చేసినాడు

ఈ క్షేత్రపాలకుడైన ఈశానుడు కృష్ణాగర్భంలో మునిగిపోగా క్రీ శ 1992లో వచ్చిన కృష్ణా పుష్కరాల సందర్భంగా ప్రధాన ఆలయాల కీశాన్యంలోగల స్నాన ఘట్టంలో త్రిముఖ దత్తాత్రేయుని, కృష్ణాపుష్కరేశ్వరుని పేర మరో శివలింగాన్ని ప్రతిష్ఠ చేయించి యజ్ఞం చేసి పూర్ణాహుతితో ముగించినాడు

ఈ కృష్ణా పుష్కరేశ్వరుని ఆయన గ్రామస్తుల సహాయంతో పెంట్లవెల్లి నివాసి యం నాగప్పగారి ధనసహాయంతో చేసినాడు భవిష్యత్తులో ఈ ప్రతిష్ఠలకు గూడ ఆలయాలు నిర్మించవలసి ఉంది

# చరిత్రలో సోమశిల దేవాలయాలు

డా. సుబ్రహ్మణ్యం
ఇ. శివనాగిరెడ్డి

సోమశిలగ్రామం మహబూబునగర్ జిల్లాలో కొల్లాపురం మండలానికి దక్షిణంగా సుమారు పది కిలో మీటర్ల దూరాన కృష్ణానదీ తీరాన ఉంది ఇక్కడ చరిత్రలో ప్రసిద్ధ తీర్థంగా పేర్కొన బడిన పదునాలుగు ఆలయాల సముదాయం ఒకే ఆవరణలో ఉంది శ్రీశైలం యొక్క జలాశయం ముంపుకు గురియైన ఈ దేవాలయాలను తొలుత పరిశీలించిన నిపుణుల కమిటీ వదలి వేయగా వీనియొక్క చారిత్రక ప్రాముఖ్యతను గుర్తించి ప్రముఖ పురావస్తు శాస్త్రవేత్త మరియు రాష్ట్రపురావస్తు శాఖ సంచాలకులు డా వి వి కృష్ణశాస్త్రిగారు యొక్కవోని పట్టుదలతో వీనిని సురక్షిత ప్రాంతానికి తరలించటానికి విశేష కృషి సల్పినారు

ఈ ఆలయాల వద్ద ఎన్నో చారిత్రిక విషయాలను వెలుగులోనికి తెచ్చిన శాసనాలు లభించినవి ఇక్కడి ఒకటవ నెంబరు దేవాలయ సోమసూత్రం పైన తర్వాతి చాళుక్యరాజైన మొదటి సోమేశ్వరుని శాసనం వల్ల ఈ సముదాయంలోని కొన్ని ఆలయాలు అతనిచే నిర్మింపబడి ఉంటాయని చెప్ప వీలవుతుంది అంతేకాక చోళచాళుక్య పోరాటాల తరువాత మొదటి సోమేశ్వరుడు (క్రీ శ 1042-68) అలంపూరు, కూడవెల్లి, సంగమేశ్వరం, సోమశిలల మీదుగా శ్రీశైల తీర్థయాత్ర సాగించినట్లు, మూడవ సోమేశ్వరుడు తన విక్రమాంకాభ్యుదయంలో పేర్కొనటం చేత ఈ గ్రామానికి సోమశిలయని దేవాలయానికి సోమేశ్వరమని చాళుక్య సోమేశ్వరుని పేరు మీదుగా ఆయా పేర్లు కలిగి ఉండవచ్చు

త్రిభువన మల్లుని కాలంలో ఇచట భీమరసుచందల దేవి యని వారు ఒక ప్రతిష్ఠ చేసినట్లు, రెండవ జగదేక మల్లుని కాలమున గంగాపురంలోని కొందరు సెట్లు లవటి సగరేశ్వరునికి సోమేశ్వరునికి కలిపి కొన్ని దానములు చేసినట్లు గంగాపుర శాసనముల వలన తెలియును కనుక బాదామి చాళుక్యుల కాలమున గంగాపురము ఈ సోమశిలా క్షేత్రములు జతగా అభివృద్ధిలో నుండెనని తలపవచ్చును

కందూరు చోళవంశీయుడైన తొండ అనే మహా మాండలికుడు కృష్ణాతీరంలో ఉన్న ఈ సోమశిలా తీర్థ క్షేత్రానికి క్రీ శ 1168 వైశాఖంలో

అచ్చంపేట తలూకాలోని లింగాల అనే గ్రామాన్ని దానం చేసినట్లు★ లింగాల శాసనంలో పేర్కొ బడింది

కందూరు చోళుల తరువాత కాకతీయుల కాలంలో గూడ ఈ దేవాలయాలను వారు పోషించినట్లు జీర్ణోద్ధరణ చేసినట్లు తెలుస్తుంది కాకతి గణపతి దేవుని రాజగురువైన విశ్వేశ్వర శివాచార్యుని శైవమత కార్యకలాపాలు సోమశిలవరకు విస్తరించినట్లు మల్కాపు శాసనం తెలియజేస్తుంది

ఇంకా క్రీ శ 1295 సంవత్సరపు కాకతి ప్రతాపరుద్రుని కాలపు సోమశిలా శాసనంలో కాకతి సేనానాధునిగా చెప్పబడిన చెఱుకు బొల్లయరెడ్డి సోమనాధ దేవునికి కందూరు దేశంలోని ప్రోలయపురి అనే గ్రామాన్ని దానమిచ్చినట్లుంది సోమశిలలోని ప్రతాపరుద్రుని కాలానికి చెందిన క్రీ శ 1297వ సంవత్సరపు వేముల శాసనంలో సోమనాధ దేవాలయాధికారులైన బాచన ప్రగడ, రుద్రయ్య, ఆయమల్ల ప్రగడ మొదలగువారు కామన యిమ్మడి కొమ్మన అనే యిరువురికి కొన్ని వృత్తులను దానమొసగినట్లు చెప్పబడింది దానిలో రాచగురువు పుత్రుడైన శంకర శివాచార్యుడు గూడ పేర్కొన బడినాడు ఆనాడిక్కడ ఒక గోళకీ మఠముండెనట

ఇక దేవాలయాన్ని వాస్తురీతిగా పరిశీలించినట్లయితే, అలంపూరు సమీపంలోని పాపనాశనం, కొల్లాపూర్ మండలంలోని మల్లేశ్వరం గ్రామాల వద్ద ఉన్నట్లు ఇక్కడ గూడ దాదాపు అదేకాలానికి ఈ పెద్ద దేవాలయ సముదాయం చెందుతుంది దీనిలో 1 నుండి 14 వరకు ఉపదేవాలయాలున్నవి 1-2,3-5,6-7-8,12 దేవాలయాలను కలుపుతూ 34 స్తంభాలతో 13వ నెంబరు మంటపం మరియు 4,9,10,11-14 విడి దేవాలయాలుగా ఉన్నవి

ఈ దేవాలయాలన్నీ గర్భాలయ అర్థ మంటపాలలోను 11వ నెంబరు దేవాలయం మాత్రం మహామంటపంతోను ఉన్నవి 2,5,6,8 ఆలయాల శిఖరాలు పాక్షికంగాను, 10వ నెంబరు ఆలయానికి విమానం పూర్తిగాను ఉన్నవి

---

★ అంతేకాక ఆ సందర్భంలోనే యిరుడు కాయిపాముల అనే గ్రామంలో తమ తండ్రి కన్ననాయకుని పేర శివాలయం, భీమచోడుని పేర విష్ణ్వాలయం, గోకర్లచోడుని పేర సూర్యాలయం కట్టించి అక్కడ ఒక చెరువుగూడ త్రవ్వించినట్లు శాసనంలో చెప్పబడింది

ఈ రాండనే పింగలలో గూడ ఒక శివాలయాన్ని, రాకొండ గుట్టపై రామేశ్వరాలయాన్ని కట్టించినట్లు ప్రజలు చెప్పేవారు

కొన్ని దేవాలయాలకు పంచకాధిష్ఠానాలు, మిగిలిన వానికి ఉపానాలు, జగతి, కుముదాలు, కపోతాలు మొదలైన వర్గాలతో ఉన్న పాదబంధ తరగతి అధిష్టానాలు, సాదాపాదవర్గం, ప్రస్తరం, కదంబ, నాగర పద్ధతి విమానాలు కల్పించబడినవి సాదా నుంచి అత్యంత రమణీయంగా మలచబడిన ద్వార బంధాలు, ఆ ద్వారాలకు గంగాయమునా, ద్వార లక్ష్మి, లతాపత్రాలు, యాళీ సింహాలు చెక్కబడినవి

మంటపం కప్పుల మీద మధ్యన నటరాజు చుట్టు వాహనారూఢులైన అష్టదిక్పాలకులు, కొన్నిచోట్లలో కోణపట్ట చదర పట్టములు పావి తాన మమరి యున్నవి

ఈ సముదాయములో 6-7-8 దేవాలయాలు ఎదురుగా ఉన్న రంగమంటపంలో కలిపి త్రికూటంగా ఉండటం వాని ప్రత్యేకతగా ఉంది తరువాత 8వ దేవాలయాన్ని 12వ దేవాలయాన్ని 5వ దేవాలయానికి 4వ దేవాలయాన్ని మోటించి కొట్టిన ఆధారాలున్నవి 6-7-8 దేవాలయాలు కేవలం సాదా ఉపాన జగతీ వర్గాలలోను ఈ మూడు దేవాలయాలు ఒకేసారి నిర్మాణం జరిగియుండటంచేత సాదా ద్వార బంధాలు వానిపైగల పూర్ణకుంభాలను పరిశీలించిన మీదట తొలి పశ్చిమ చాళుక్యుల అంతిమదశలో అంటే క్రీ శ 8వ శతాబ్ది పూర్వార్థంలో అవి నిర్మింపబడి ఉండవచ్చుననే అభిప్రాయం కలుగుతుంది

12వ నెంబరు దేవాలయం ద్వారం మీది శిల్పం మరియు దేవాలయానికి కెదురుగా ఉన్న మకర తోరణాన్ని బట్టి ఈ దేవాలయం రాష్ట్రకూటుల కాలంలో క్రీ శ 9వ శతాబ్దంలో నిర్మించబడిందని చెప్ప వీలవుతుంది ఇంకా యీ ప్రాంతంలో భవనాశీ కృష్ణా సంగమ స్థానంలోను, ఎల్లేశ్వరం, మియాపూర్ గూడెములలోను ఇదేకాలానికి చెందిన రాష్ట్రకూటాలయాలున్నవి

మూడవ దేవాలయం ముందున్న మంటప స్తంభాలు కరీంనగర్ జిల్లాలోని బెజ్జంకి దేవాలయ రంగమంటపంలోని స్తంభాలతో సరిపోలుతున్నవి అంతటి శిల్పం లేదుగాని యోగపట్టమున్న శివుడు దేవి, ఉమా మహేశ్వర, బ్రహ్మ, విష్ణు, మహేశ్వర శిల్పాలు కాకతీయుల శిల్పకళానైపుణ్యానికి మచ్చు తునకలు

1-4 దేవాలయాల అర్ధ మంటప స్తంభాల మధ్యభాగంలో పంచతంత్రంలోని దేవవర్మ ముంగీస సంఘటన, మహాభారతంలోని దృష్టద్యుమ్న శల్యుల మధ్య యుద్ధ సంఘటన అత్యద్భుతంగా శిల్పీకరించటం జరిగింది

పై శాసన వాస్తుశాస్త్ర విషయాలను పరిశీలించిన మీదట సోమశిల తొలి పశ్చిమ చాళుక్య, రాష్ట్రకూట తర్వాతి చాళుక్య, కందూరు చోళ-చెఱుకు ముఖ్య కాకతీయ రాజుల కాలంలో క్రీ శ 8వ శతాబ్దం నుండి 13వ శతాబ్దం వరకు గొప్ప పుణ్యతీర్థంగా భాసిల్లి ఉండవచ్చునని చెప్పవీలవుతుంది

ఏనుగుల వీరాస్వామి తన కాశీయాత్రా చరిత్రలో క్రీ శ 1830 జూన్ 21నాడు నివృత్తి సంగమేశ్వరంలో విధులు ముగించుకొని సిద్దేశ్వరం దగ్గర కృష్ణను దాటి పెంట్లవెల్లికి చేరినట్లు చెప్పినాడు సిద్దేశ్వరం నుండి కృష్ణను దాటగా సోమశిలనే వస్తుంది కాని అతడు దీన్ని పేర్కొనక పోవటం వల్ల అప్పటికే దీని ప్రశస్తి తగ్గింది అనవలసి ఉంది

శిధిలమై జీర్ణావస్థలో నున్న ఈ ఆలయాల గత వైభవాన్ని పునరుద్ధరించటానికి డాక్టర్ వి వి కృష్ణశాస్త్రి పురావస్తు యింజనీరు శ్రీ సత్యనారాయణ మిక్కిలి శ్రమకోర్చి సోమశిల గ్రామాన్ని ఎన్నో మార్లు పర్యటించి అన్ని పనులను స్వయంగా పర్యవేక్షించినారు వారికీ బృహత్తర కార్యక్రమంలో ఈ శాఖ సహాయ సంచాలకులు సర్వశ్రీ నారాయణరావు డి యల్ యన్ శాస్త్రి, కె లక్ష్మణమూర్తి, భాస్కర్ గారలు ప్రతి యంశమున ఆసక్తి కనబరచి దేవాలయాల పునర్నిర్మాణం సత్వరంగా జరగటానికి తోడ్పడినారు

దేవాలయాల తరలింపుతో ఉత్పన్నమైన అనేక సమస్యలను సమయస్ఫూర్తితో పరిష్కరించి అనువైన స్థలాన్ని ఎంపిక చేసి తగురీతిలో పీఠం నిర్మించి సుందరతర ప్రదక్షిణా పథమేర్పరచి శిధిల శిఖర భాగాలను పునరుద్ధరించి కాకతీయుల కాలంలో విలసిల్లిన ఈ తీర్థక్షేత్రాన్ని జ్ఞప్తికి తెచ్చిన రాష్ట్ర పురావస్తు శాఖ రాష్ట్ర అధిలేఖాగార శాఖ మరియు ప్రాచ్య వ్రాత ప్రతుల భాండాగార సంచాలకులు డా॥ వి వి కృష్ణశాస్త్రిగారిని సోమశిల ప్రజలు వేనోళ్లకొనియాడుచున్నారు



# సోమేశ్వరంలోని శిల్ప సంపద

పాలమూరు జిల్లాలో ఆలంపురంలోని నవబ్రహ్మాలయాలు, బెక్కెంలోని మూకగుళ్ళు, కృష్ణా తీరంలోని పంచేశ్వరాలు అనేవి కేవలం ఒక్కొక్క ఆలయమే కాక ఒక్కొక్కటి ఒక ఆలయ సముదాయంగా ఉండి ఈ జిల్లాలోని చారిత్రక సాంస్కృతిక విశేషాలెన్నో ఇక్కడి శిల్పాలలో నిక్షిప్తమై ఉన్నవి

ఈ సముదాయాలలో ఆలంపురంలోని నవబ్రహ్మాలయాలు కదిలించరాక తుంగభద్రలోనికి నీరెక్కినపుడు ముంపుకు గురికాకుండా అక్కడ పెద్ద రాతిగోడ కట్టినారు అగస్త్యేశ్వర - మల్లేశ్వరాలయాలను గోపాల పురానికి, కూడలి సంగమేశ్వరాన్ని ఆలంపురానికి, సిద్దేశ్వరాన్ని నందికొటుకూరుకు, నివృత్తి సంగమేశ్వరాన్ని జగన్నాథం గట్టుకు తరలించి కపిలేశ్వరాన్నెటూ కదిలించలేక కృష్ణకే విడిచినారు

సోమేశ్వరాన్ని అక్కడనే ఒక మైలు దూరంలో ఎత్తుప్రదేశంపై మళ్ళీకట్టినారు మన ప్రభుత్వం భారత దేశంలో ఈ విధంగా ఆలయాలను తరలించి పునర్నిర్మించటానికిదే మొదటిసారియట•

సోమేశ్వరంలో ఒకే ఆవరణలో పన్నెండు శివాలయాలు, ఒక దేవీ ఆలయం ఉన్నవి ఆ విధంగా ఒకే ఆవరణలో అనేకాలయాలుండటం ఈ ప్రాంతానికి అపురూపమేమి కాదు ఉమామహేశ్వరంలోని పంచలింగాలగుడిలో ఒకే ఆవరణలో అయిదు, కందూరులోని రామలింగేశ్వరాలయంలో ఒకే ఆవరణలో ఆరు, మల్లేశ్వరం, సప్తకోటీశ్వరాలలోని ఒకే ఆవరణలో ఏడు, అలంపురం, పాలంకేశ్వరాలలో నవబ్రహ్మల పేర ఒకే ఆవరణలో తొమ్మిది ఆలయాలున్నవి అలాగే యిక్కడ ఒకే ఆవరణలో పన్నెండు గుడులున్నవి అవిపుడు ద్వాదశ జ్యోతిర్లింగాలకు సంకేతంగా భావించబడుతున్నవి కాని ఈ ప్రతిష్ఠలకు పూర్వం ఏయే పేర్లుండెనో తెలిసిరాలేదు

శిల్పులిక్కడ ఈ ఆలయాలకు ఎఱ్ఱని రాయి శివలింగాలకు నందులకు నల్లసరపురాయి మరికొన్నిటికి తెల్లని పిండిరాయి, బండరాయిని ఉపయోగించినారు

కాకతీయుల కంటె మొదట శిల్పంలోనికి నల్లసరపురాయి అడుగు పెట్టలేదట

ఆలయాల కుపయోగించిన రాయి లేత వంకాయ రంగులో ఉంది అదిక్కడి గట్టున లేదు నల్లమలకొండలలో అమరాబాదు పీఠభూమిపై తిరుమలాపురం కురువలోను ఉంది

అలంపురానికి గాని ఇక్కడికిగాని ఈ ఆలయాలరాయి జగన్నాథం గట్టునుండి తెచ్చినట్లు చెప్పుకుంటారు తెల్లని పిండిరాయి ఇక్కడనే గల మల్లెగుండు గట్టుపై తీసి ఉంటారు

ఇక్కడి ఆలయాలలో మూడు దశల నిర్మాణం కనిపిస్తుంది అదిరాతి మలుపులోను, దాని నునుపుదనంలోను, ఆలయాల అధిష్ఠాన పీఠాలలోను, స్తంభాలు వానిపైగల కర్ణెబిళ్లలలోను, హంసపాదులలోను మనకు స్పష్టంగా కనిపిస్తుంది

ఈ భేదాలయొక్క చారిత్రక విశ్లేషణ పురాతత్వ వేత్తలు చేసినారు అది చరిత్రలో సోమశిల అనే వ్యాసంలో చూచినారు

ఈ ఆలయాలన్నింటికి ముఖద్వారంపై గజలక్ష్మి చిత్రించబడింది ఈమె మన ఆలయ ద్వారాలపై జైనుల కాలంనుండియే తిష్ఠవేసింది ఖిల్లా ఘణపురం సమీపంలోని గట్టుకాడిపల్లెగుట్టలలో గల శివాలయ ద్వారంపై గజలక్ష్మివలెరెండేనుగుల నడుమ శివలింగం, ఎండవెల్ల భీమేశ్వరాలయ ప్రధాన ద్వారంపై ఆసీనులైన శివపార్వతులు చిత్రించబడినారు ఇట్టివి నాకు మరో చోట కనిపించలేదు

ఇక్కడ కొన్ని ఆలయాలకు ద్వారపాలకుల స్థానంలో చామర గ్రాహిణులున్నారు ఈ సముదాయంలో 11వ నెంబరు ఆలయద్వారం అన్నిటికంటే విశేషమైన శిల్పంతో ఆలరారుతుంది మూడవ అయిదవ ఆలయాలపై గడపలకు పక్షుల వరుసలు తీర్చబడినవి జటప్రోలు మదన గోపాలాలయంపై ఆ శిల్పి ఇక్కడి పక్షులను చూచియే ఆ వరుసలు తీర్చవచ్చు కాని ఆనాడా పక్షులకు జటలుంచి అది జటప్రోలు అని నిరూపించినాడు

అదే ద్వారాల నిలువు బాజులకు ఒకరిక్రింద ఒకరు నాట్యం చేసే పురుషులు మలచబడినారు సాధారణంగా ఆలయంలోని మూర్తికి సరూపమైన శిల్పం ఈ బాజులపై చూపబడుతుంది మామిళ్ళ నృసింహాలయానికి ఈ స్థానంలో ఒక దానిపై ఒకటిగా సింహాలు మలచబడినవి ఇంద్రకల్లులో బయటపడిన ఒక ద్వార శకలంపై ఈ స్థానంలో పద్మాసనాసీనులై కరతల కల పుష్పంతో ఉన్న ధ్యానమూర్తులు శిల్పించబడినారు ఇపుడా ద్వారం గల ఆలయం లేదుగాని, ఉన్న నాడది పార్శ్వనాథునిదై ఉంటుందని చెప్పవీలుంది కాబట్టి పై ఆలయాలలోని శివలింగాలు నటరాజ మూర్తులకు సంకేతాలేమో అనవలసి ఉంది

గంగాపురంలో చెన్నకేశవాలయం యొక్క సింహద్వారానికి సింహాలు తీర్చబడినవి ఇవి ఆనాటి శిల్పుల యొక్క శిల్పకావ్యంలోని ఔచిత్యాలకు నిదర్శనాలు

ఈ ఆలయాలలో మొదటి దానిలో ఎనిమిదవ దానిలో తప్ప తక్కిన వాని అన్నిటిలోని సోమసూత్రాలు చతురస్ర పీఠాలు దేవతా మూర్తులు ఆసీన మూర్తులు ఉత్థానక మూర్తులు అని రెండు రకాలు వైదిక సంప్రదాయంలో శివునికి లింగరూపమేకాని ప్రతిమా కల్పనం లేదు అందుచేత శివాలయాలలోని చతురస్ర పీఠాలు శివుని యొక్క ఉత్థాన మూర్తికి వలయపీఠాలు, అతని ఆసీన మూర్తికి సంకేతాలుగా నిర్ణయింపబడినవి అంటారు ఈ చతురస్ర పీఠాలన్ని చాళుక్యులకాలంలోనే వచ్చినవి

శివునికి లింగరూపంగా కనిపించటానికి విశ్వకర్మయొక్క శాపం కారణంగా చెప్పబడుతుంది

ఆలయాలలోని విరాణ్మూర్తులు నల్లని రాతిచే చేయబడవలెనని శిల్ప శాస్త్రమతం వాని అధిష్ఠాన పీఠం మాత్రం సామాన్య శిలతో కూడ చేయవచ్చు కాని యిక్కడ సోమ సూత్రాలు శివలింగాలు అన్ని నల్లరాతితోనే చేసినారు 1,2-12 ఆలయాల ముందుండే నందులు మాత్రం చిన్నవిగా ఉన్నవి తక్కినవన్ని పెద్దవి

చిన్న నందులు పొట్టిగా, కుదిమట్టంగా ఉండగా పెద్దవి జీవకళలుట్టిపడుతు మెడలో గజ్జల పట్టెడలతో వీపుపై నాగబంధముడులతో ఉన్నవి శివాలయాల ముందు ఈనాడున్న నందులు ధర్మ దేవతకు చిహ్నం అవి యుగ ధర్మాన్ననుసరించి మూడు కాళ్ళు పొట్ట క్రిందికి ముడుచుకొని ఒక్కకాలు మాత్రం లేవటానికి నిలిపి ఉంటవి ఈ నిలిపేకాళ్ళలో గూడా మళ్లి సంప్రదాయభేదం ఉంది సమాధులపై ప్రతిష్ఠించే నందులు ఎడమకాలు లేపినట్లు ఆలయాల ముందువి కుడికాలు లేపినట్లుంటవి

తెలంగాణం లోని నందులన్ని అన్ని కాళ్ళు కడుపు క్రిందికే ముడుచుకొని ఉన్నవిగాని భైరవకోనలోని నందులు వెనకరెండు కాళ్ళు ఆలయంవైపు చాపుకొని ఉన్నవి అటువంటివి నాకు మరెక్కడా కనిపించలేదు అవి ఏకాండీ శిలలతో తీర్చవలసి వచ్చినందుకు శిల్పులట్లా చెక్కినారో లేదా మరేదైనా దేశాచార భేదమో తెలిసి రాలేదు

ఇక్కడి త్రవ్వకాలలో ఆలయం వంటి రాతివే పెద్ద నందులు బయలు పడినవి అవిపుడు శిథిలమైనవి కాని వానిని చూడగా ఇక్కడ ఆలయాల ముందు మొదలవియే ఉండెనని కాలక్రమంలో అవి తొలగించి ఇపుడున్నవి నిలిపినారనవలసి ఉంది

ఇపుడు గూడ 9,10వ గుడుల ముందు అన్నిటి వంటి నందులు లేవు 9వ దాని ముందు తెల్లని రాయిది, 10వ దాని ముందు బండరాయిది బోసిగాకుండా నిలిపినారు

ఈ నందులు చాలా చిన్నవి మునుముందవి గూడ తొలగించ వలసినవే ఆలయాలలో మంటపంలోని పైకప్పుకు పద్మంగాని నాగబంధంకాని తీర్చటం ఒక సంప్రదాయం



ఆలయంలో ఒక స్తంభం

కాని ఇక్కడ 1-3,5 వ ఆలయాలపై శివుడష్టదిక్పాలకులతో కొలువుదీరినాడు 1-5వ ఆలయాలపై పార్వతీదేవితో అతడాసీనుడై ఉండగా 3వ దానిపై అతడు నాట్యం చేస్తు త్రిభంగిలో నిలిచినాడు బహుశః అతని యొక్క ఈ రూపాలు ఆయా ఆలయాలలోని శివలింగాలకు సంకేతాలేమో అనిపిస్తుంది

ఈ పై కప్పులో ప్రతిచోట అతని చుట్టు అష్టదిక్పాలకులు తమతమ వాహనాలతో నిలిచినారు కాని మొదటి గుడి దగ్గర మాత్రం కుబేరుడు తగరుపై ఉన్నాడు అతడు కుబేరుడేనా! మరొకరా! ఈ సాంప్రదాయం కూడా ఏదో తెలిసి రాలేదు ఆలంపురంలో ఈ స్థానంలో నాగవలయాలున్నవి

ఇక్కడి దేవికి ''లలిత'' అని పేరు లలితాదేవికి ప్రత్యేకమైన ఆలయం నైమిశారణ్యంలో ఉంది అక్కడ ప్రతి అమావాస్యకు పెద్ద ఉత్సవం సాగుతుంది ఇక్కడి ఆలయంలోని మొదటి మూర్తి భగ్నం కాగా ఇపుడున్న దానిని శ్రీ వి వి కృష్ణశాస్త్రిగారిప్పించారట వీరి తాతగారు వేలూరి శివరామ శాస్త్రిగారు గొప్ప తాత్వికులు మరియు పండితులు



లలితాదేవి, సోమశిల

ఇక్కడి మొదటి లలితాదేవి యొక్క భగ్నావశేషమైన శిరం కొల్లాపురంలోని జూనియర్ కాలేజీలో ఉందట

ఇక్కడ ఎనిమిదవ ఆలయంలో ఒక అష్టభుజ మహిషమర్దిని ఉంది ఈ మూర్తి విశ్వామిత్ర గుహ కెదురుగా గల బిలం ఉండెనట అందువల్ల స్థానికు లీమెను బిలంకామాక్షమ్మ అన్నారు గాని ఆమె కామాక్షి కాదు కామాక్షి కంచిలోని దేవత ఆమె ఆసీనురాలై ఉండి ఎడమకాలు క్రింద మూడు మానవ శిరస్సులుంటవి. పంచేశ్వరాలలోని



మహిశాసుర మర్దిని

సంగమేశ్వరంలో గల స్వామికి మహాదేవుడని అతని దేవేరికి మహాదుర్గ అని నామాంతరాలు కాబట్టి ఈ దేవి మహాదుర్గ

ఇక్కడి త్రవ్వకాలలో మరో మహిష మర్దిని మూర్తి గూడ బయలుపడింది అది ఆలయావరణంలో ఉంచబడింది (నెం 42) ఆ శిల్పంలో మహిషుడు పూర్తిగా మహిషమేగాని ఈ మహిషునికి తలమాత్రమే ఎనుముది

మహిషుని రూపాలు ఈ జిల్లాలో ఐదు విధాలుగా కన్పిస్తున్నవి ఇక్కడ అనగా ఈ సోమశిలలో బయలుపడిన మహిష మర్దినిలో మహిషుడు పూర్తిగా ఎనుము, ఇంద్రకల్లులో అతని పూర్వకాయం నరుడు ఉత్తరకాయం ఎనుము రామగిరిలో మహిషునికి తలమాత్రమే ఎనుము కందూరిలో మానవశిరస్సుకే మహిష శృంగాలు, తీగలపల్లిలో మహిషుని వెనుక ఉబ్బెత్తుగా ఎనుము రూపం మలచబడినవి ఇవి ఆయా కాలాలలో శిల్పులలో కలిగిన భావ పరిణతికి గుర్తు అనవలె

అలాగే ఎనుము కొమ్ములు తీర్చటం గూడ రామగిరిలో శృంగాలు అర్ధ చంద్రాకారంగా ఉండగా తీగలపల్లిలో అవి తీర్చనలయంగా సాగినవి ఇక ఈ సోమశిలలో మహిషునికి తలకు రెండు వైపులలో కొమ్ములు వ్రాలిపోయి అర్థ చంద్రాకారాలుగా తిరిగినవి ఇది ఒరిస్సా పద్ధతియట, బహుశః శిల్పి అక్కడి వాడు కావచ్చు లేదా ఆ పద్ధతితో ప్రభావితుడు కావచ్చు

ఎనుములకు కొమ్మలు తీర్చటంలోని ఈ భేదాలు ఆయాదేశ రీతులను సూచిస్తవి అనవలె

ఇక్కడి దేవీ మూర్తి మరొకటి బయటపడింది ఆమె పద్మాసనాసీనయైన ప్రపత్తి మూర్తి తలపై కేశ సంపద కిరీటం వలె తీర్చబడింది (నెం 43) సరిగా యిటువంటి మూర్తులే రెండు తరణి కల్లులో ఉన్నవి అది ఒకపుడు సౌరక్షేత్రం అక్కడ పెద్ద సూర్యాలయం ఉండేది కాబట్టి అక్కడపడి ఉన్న ఆ దేవి మూర్తులు ఏదో దేవీ ఆలయం యొక్క ద్వారపాలికలు బహుశః అక్కడ పూర్వం సూర్యునితో పాటు సంజ్ఞా - ఛాయాదేవతలకు గూడా ఏదైన ఆలయం ఉండేదేమో

శంకరాచార్యుడు స్థాపించిన షణ్మతాలలో శైవం, శాక్తేయం, గాణాపత్యం, కాపాలికం నాలుగు ఒకే కుటుంబానికి చెందినవి కనుక వానికి కౌమారం గూడ కలుపు కుంటె

శివపంచాయితనం పూర్తి అవుతుంది కౌమారం తమిళంలో ఒక ప్రత్యేక శాఖగా వర్ధిల్లింది వారుకుమారస్వామిని ''మురగన్'' అంటారు

ఇక్కడ త్రవ్వకాలలో మూడు గణపతి మూర్తులు బయటపడినవి అవి ఎర్రరాతివే కాబట్టి (నె 1 15 36) ఆలయం యొక్క మొదటి దశ నిర్మాణానికే చెంది ఉంటవి అనవలసి ఉంది

రెండు కుమారస్వామి ప్రతిమలు బయట పడినవి (నె 7-35) ఏడవ నెంబరు గలది తెల్లని రాతిది అది ఆరుతలలు మాత్రమే లభించినవి కబంధం దొరకలేదు కాని యిది పరిమాణంలో పెద్దది - రెండవది శూలపాణియై కూర్చున్న ప్రతిమ అతని తొడపై దేవసేన చేతిలో శూలాయుధం ఉన్నవి నెమిలి వెనుక నిలిచినట్లు ఉబ్బెత్తుగా మలచ బడింది ఇది వీరగల్లువంటి ప్రతిమ

శివ మూర్తులు రెండు బయట పడినవి (నెం 9) ఇవి ఆసీన ప్రతిమలు ఎర్రనిరాతివి కనుక నిర్మాణాన్ని బట్టి మొదటి దశకు చెందుతవి ఇవిగాక మరొకటి తెల్లని రాతిది దిగంబరమూర్తి బయటపడింది అతని చేతిలో గద ఉంది సంస్కృతంలో గదను లకుటం అనిగూడా అంటారు కాబట్టి గదాపాణియైన శివునికి లకులీశుడని పేరు గంగాపురంలో గూడ లకులీశ ప్రతిమ ఒకటి ఉంది కాపాలికు లీదైవాన్ని ఆరాధిస్తారు ఈ మూర్తిని బట్టి ఒకప్పుడిక్కడ లకులీశ సంప్రదాయం కూడ వర్ధిల్లిం దనవలసి ఉంది

వైష్ణవులు కోలాటాన్ని 'లకుటరాసం' అని పిలుస్తారు అది శ్రీకృష్ణుని రాసక్రీడలో వస్తుంది

ఈ దిగంబర శైవమూర్తియే గాక యిక్కడ సుందరమైన ఒక భైరవమూర్తి గూడ బయలు పడింది అది నల్లరాతిది కాబట్టి దాన్ని బట్టి యిక్కడ భైరవుని ఆరాధించే సంప్రదాయం కూడా ఉన్నదని చెప్పవచ్చు దేవరకొండ వెలమల కాలంలో తెలంగాణంలో సుందరమైన భైరవ మూర్తులు చాలా వెలసినవి

దేవీ వాహనం సింహం కనుక ఆమె ఆలయం ముందు యాళీసింహ ప్రతిమ నందిస్థానంలో ఉంటుంది శ్రీశైలం, ఉమామహేశ్వరాలలో యిది చూడవచ్చు ఇక్కడ ఎర్రరాతిది ఒక యాళీ సింహం బయట పడింది

ఇవిగాక రెండు పెద్దపెద్ద సింహతలాటాలు బయట పడినవి (నెం 18-19) ఇవి గూడ ఎర్రరాతివి ఇట్టివే ఇంద్రకల్లు, కారువంగ గ్రామాలలో కూడ ఉన్నవి కాని అవి



భైరవుడు, సోమశిల

బండరాతివి బహుశః ఆనాడివి ఆలయం శిఖరస్థానంలో ఉండేవేమో సింహతలాటాలు జైనాలయాలకు అమలక స్థానంలో ఉండేవట కాబట్టి ఇవి సిద్ధేశ్వరానికి సంబంధించినవి కావచ్చు సోమసూత్రద్వారాలకు సింహతలాటాలుండటం కూడ జైన సంప్రదాయమేనట

పశ్చిమ చాళుక్యులు తాముకట్టించిన ఆలయాలన్నిటి ముందు ద్వారాల దగ్గర యిరువైపులా ఏనుగులను నిలిపినారు ఇవి మనకు గంగాపురం, ఆవంచలోని రాజప్రాసాదాల

ముందు కనిపిస్తవి ఆలయాలకు మెట్ల ప్రక్కన పిట్టగోడలలో ఏనుగులను హోయసల ప్రభువులు నిలిపినారు గంగాపురంలో కోటద్వారానికి రెండువైపులా గూళ్లలో మావటీ లెక్కిన ఏనుగులున్నవి



ముఖద్వారంలో ఏనుగులు, ఇంద్రకల్లు

ఆలయ ద్వారాలముందు ఏనుగులను నిల్పిన సంప్రదాయం యిక్కడ కూడా కనిపిస్తుంది యిక్కడ మూడు జతల ఏనుగులు దొరికినవి అవిబండరాతివి ఆవంచ, ఇంద్రకల్లు గ్రామాలలో గూడ బండరాతివేగాని పనితనంలో వానికి వీనికి చాలా భేదం ఉంది. ఇక్కడి ఏనుగులకు తలపై కుంభ స్థలాలు ప్రత్యేకంగా ఎత్తుగా చిప్పలు బోర్లించినట్లు మలచబడినవి



ఆలయ ద్వారం దగ్గర గల ఏనుగు

శివతత్వ రత్నాకరంలో మల్లికార్జున పండితుడు సౌరాష్ట్ర దేశపు ఏనుగులు పొట్టిగా ఉంటవి, వాని కుంభస్థలం ఎత్తుగా ఉంటుందని చెప్పినాడు సోమనాధుడు సౌరాష్ట్రదైవం చంద్రుడా దైవాన్నారాధించియే తనయొక్క క్షయవ్యాధిని పోగొట్టుకున్నట్లు పురాణ కధనం కనుక ఈ సోమేశ్వరాలయం సౌరాష్ట్రస్వామి ఆలయానికి ప్రతిబింబమా ! దాన్ని శిల్పులీగజశిల్ప నిర్మాణంలో సూచిస్తున్నారా ! ఆలోచించవలసి ఉంది

ఇక్కడ ఇంకా చాలా శిల్పాలు బయలుపడినవి వానిలో చిత్ర శిల్పం గూడా విరివిగానే చోటు చేసికున్నది ఏనుగుతల ఉండే సింహాలు, రెండు ఎద్దులకు, రెండు సింహాలకు ఎద్దు ఏనుగుకు కలిపి ఒకే తల ఉండే శిల్పాలు, ఒకే దేహానికి రెండు తలలుండే గండభేరుండ పక్షులు ఇక్కడి చిత్ర శిల్పాలలో ముఖ్యమైనవి ఇవిగాక జంతువుల వేట గూడ ఆలయకుడ్య ఫలకాలపై ఉంది ఇవన్నిగూడ ఎర్రరాతి శిల్పాలే శ్రీశైల ప్రాకారంపై యిటువంటి అనేక విధ శిల్పాలు దర్శనమిస్తవి శిల్ప ప్రపంచానికి ఆ ప్రాకారం ఒక విశ్వం వంటిది కనుక ఆ శ్రీశైలానికి ఇది కూడ ఒక ద్వారం కావటం వల్లనేమో అక్కడి శిల్పంవంటి శిల్పం యిక్కడ గూడ అనలు తొడిగింది అందుచేత పరిశీలకులిక్కడి చిత్రశిల్పాన్ని, ప్రతిమా శిల్పాన్ని ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసి ఉంది

# అష్టదిక్పాలకులు

దిక్పాలకుల యొక్క రూప విషయంలోను వారి వారి ఆయుధ, వాహనాల విషయంలోనూ మన పురాణాలకు ఆగమాలకు ఐక్యత లేదు కనుక వాని భేదాలు చిత్తగించండి

1. **ఇంద్రుడు :** నీలవర్ణుడు – పాలాక్షుడు, నుదుట ఇతని కన్ను అడ్డంగా వుంటుందని బృహత్సంహిత కాదు నిలువుగానే ఉంటుందని అంశమద్భేదాగమం చెబుతవి ఇతడు చతుర్భుజుడు అంకుశం, వజ్రం, కమండలం, నీలోత్పలం, అక్షమాల కమండలం అనేవి ఇంద్రుని ఆయుధాలు వీనిలో ఏవైనా ఉండవచ్చు కానితరుచుగా వజ్రాంకుశాలు రెండే చూపుతారు ఐరావతం ఇతని వాహనం

2. **అగ్ని :** ద్వివుఖుడు – త్రినేత్రుడు, సప్త జిహ్వుడు, ధూమకిరీటుడు మహాభారతంలో ఇతని రథానికి ఏడు ఎర్రని గుర్రాలుండగా విష్ణుధర్మోత్తరంలో ఇతని వాహనం హంస, హయశీర్ష పంచరాత్రంలో ఇతని కేడుతలలు ఒకమేడ శక్తి, అక్షసూత్రం, కమండలం స్రుక్స్రువాలు యితని ఆయుధాలు, పొట్టేలు యితని వాహనం

3. **యముడు :** మిక్కిలి నల్లనివాడు, భయంకరాకారుడు, చతుర్భుజుడు, గద, పాశం, ఖడ్గం, ఖేటం ఇతని ఆయుధాలు మహిషం ఇతని వాహనం

4. **నిర్ఋతి :** మిక్కిలి నల్లని వాడు, భీకరాకారుడు, చతుర్భుజుడు, ఖడ్గం, ఖేటం ఇతని ఆయుధాలు ఇతడు నరవాహనుడు

5. **వరుణుడు:** తెల్లనివాడు - పీతవస్త్రధరుడు, వజ్రకిరీటుడు, యజ్ఞోపవీతధారి, చతుర్భుజుడు, పద్మం, పాశం, శంఖం, రత్నపాత్రిక ఇతని ఆయుధాలు మకరం ఇతని వాహనమైనా అంశమద్భేదాగమంలో ఇతడు కరండ మకుటంధరించి మత్స్యవాహనం కలవాడైనట్లుగా చెప్పబడింది విష్ణుధర్మోత్తరంలో ఇతనికి ఏడుహంసలు లాగేరథం, తెల్లని గొడుగు చెప్ప బడినవి

6. వాయువు . ఇతడు చతుర్భుజుడు, త్రినేత్రుడు  పతాకం, వజ్రం, అంకుశం, కమండలం ఇతని ఆయుధాలుగా చెప్పబడినవి  ఉత్తరభారతంలో ఇతనికి ఎలుక, గుర్రం కూడ వాహనాలుగా ఉన్నవి

7. **కుబేరుడు :** చతుర్భుజుడు, కురూపి, పెద్ద బొజ్జ మీసం - గడ్డం కలవాడు  గదా, ఖడ్గం, శక్తి, శంఖం ఇవి ఇతని ఆయుధాలు, బృహత్సంహితలో ఇతడు గార్దభవాహనుడు  అగ్నిపురాణ అంశుమద్భేదాగమాలలో మేషవాహనుడు, మాన సోల్లాసంలో నరవాహనుడు, అట్లాగే పత్నుల విషయంలో గూడ ఇతనికి వృద్ధి, విభావ అని ఇద్దరు పత్నులున్నట్లు చెప్పబడింది  ఉత్తరభారతంలో ఇతని వాహనం మేషం

8. **ఈశానుడు :** తెల్లనివాడు, చతుర్భుజుడు, త్రినేత్రుడు  శూలం, ఢమరుకం, పరశువు ఇతని ఆయుధాలు  వృషభారూఢుడై ఉండును



# సోమశిల శాసనాలు

సోమశిలను ప్రస్తావించిన శాసనాలింతవరకు శాసన వాఙ్మయంలో ఆరు లభించినవి ప్రాచీన కాలంలో పుణ్యక్షేత్రాలకు సంబంధించిన శాసనాలు ఆ క్షేత్రంలోనే గాక వానికి దానంచేసిన గ్రామాలలోను లేదా దానకర్తలు తమ గ్రామాలలోను కూడ వానిని వేయించేవారు ఇందుకు సోమశిలను ప్రస్తావించిన శాసనం ఒకటి గంగాపురంలో ఉండటమే నిదర్శనం కాబట్టి ఈ క్షేత్రానికి సంబంధించిన శాసనాలు ఇంకా ఏమైనా ఎక్కడైనా ఉన్నాయేమో చెప్పలేం

ఇంతవరకు లభించిన శాసనాల వివరాలు పురాతత్వశాఖ వారు ప్రచురించిన ''సోమశిల దేవాలయాల చరిత్ర'' అనే పుస్తకంలో ఉన్నవి అయితే వానిలో శాసన వివరాలే ఉన్నవి కాని మూలపాఠాలు మాత్రం వారందులో ప్రచురించలేదు

ప్రస్తుతం నాకు లభించిన మూల పాఠాలు కొన్ని యిక్కడ యిస్తున్నాను



# 1. లింగాల శాసనం

1 శ్రీయిం పుష్ణాతువో విష్ణుర్వరాహమధి కోన్నలిం
భువనోత్తం భనోస్తంభ శుంభర్దంష్ట్రాంకురం వపుః

2 స్మద్మవ శుంభగుణ గ్రామస్య రామోపమో
భూపాలః కరికాల యిత్యభిహితః తిగ్మాంశువంశోద్భవః
యద్వేదం డకులై స్సతల సలిల క్రీడావ తీర్ణోరభూ
ద్భూయో దక్షిణ వారిధౌ క్షితిధరై తత్సేతు బంధాద్భుతం

3 తద్వం శోజని సజ్జన స్తుతయశో కక్షద్గుణానాం నిధి
స్తాండో మండలికా చలేంద్ర కులిశం గండాంక కాలా నలం
చిత్తేషు జ్వలితం యదీయ విపుల ప్రోష్ట
4 xమల్లనాసి రుజ్జ్వల యశో, వల్లీ సమావర్ధతో
సంసిక్తేత మహీసురకర, ప్రక్షిప్త ధారాజ లైః

5 పౌలస్త్యస్య చమూపతిః పతిహితా ప్రారంభ శుంభద్భుజా
దండస్తన్నుత కన్ననాయక సుత స్తాండ ప్రచండోదయః
దత్తేయాస్య శివశ్శిరస్యధిపతే రాజ్ఞా జయశ్రీ ర్భుజే
సత్యంవాచి యశాంసిదిక్షు సుగుణాస్తస్య ప్రతాపోరిషు

6 తేనస్వఖాని తా గాధ తటాక కులశాలినీ
గ్రామే భూరి ఫలారమే కారుపాముల నామని

7 భీమనామ్నా మురరిపుః పితానామ్నా మహేశ్వరః
గోకర్ణ నామ్నా తిగ్మాంశుః స్థాపిత స్థిర కీర్తినా

8 తేభ్యో హరిహరార్కే-భ్యస్స గోకర్ణ మహీపతిః
బ్రహ్మణేభ్యశ్చ వింశత్యే రతే ధ్యశ్చత కర్మసు

9 వైశాఖ రసదిగ్స్వాప ...ప్కృతే శకవత్సరే 1090
తీర్థ స్సోమశిలా నామ్ని కృష్ణవేణ్యా తటాశ్రయే
కందూరి మండలాం తస్థం శ్రీశైలాపత్య కాగతం
గ్రామం లింగాల దద్యాత్

అసంపూర్ణం

చూ. కందూరు చోళుల శాసనాలు సం. ***40***

ఈ శాసనమును వేయించినవాడు మహామాండలికుడైన తాండ ఇతడు మల్లసాని కన్నర దేవుల కుమారుడు వర్ధమాన పురాన్ని పాలించిన భీమ గోకర్ణుల సామంతుడు శ సం 1090 అనగా క్రీ శ 1168 కాలానికి చెందినవాడు

ఇతడు కారుపాముల గ్రామంలో కందూరి భీమదేవచోడునిపేర విష్ణ్వాలయం గోకర్ణదేవుని పేర సూర్యదేవాలయం తమ తండ్రియైన కన్నర దేవుని పేర శివాలయం నిర్మింప జేసినాడు అంతేకాక ఇతడు కందూరు మండలంలోని లింగాల గ్రామాన్ని కృష్ణాతీరంలోని సోమశిలకు దానం చేసినట్లు ఈ శాసనంలో చెప్పబడింది

ఇతడాలయాలు కట్టించిన కారుపాముల యిపుడు లింగాల అచ్చంపేట తాలూకాలో చేరి ఒక మండలంగా ఉంది

# 2. గంగాపుర శాసనం

స్వస్తిశ్రీ మత్ప్రతాప చక్రవర్తి జగదేకమల్ల వర్షదర దుర్మతి సంవత్సర మార్గశిర బహుళ అమావాస్య ఆదివార దద్య కోడూరు నవపురదస్థానపతి సందేవ సంది యర్మకుడె బనమరికం యదలాగలా x తుకూడి తమ ప్రీతి యెళగె హోలకుండెయ హెఊగెయు మత్తరు గట్టి ముం మత్తరు త్తాం దలంతు మారు మత్తరు వయ్య xxxx సాగర నాయక నర్యలు xxx సలమని xx తన్నద్రి తర్య యందగడిద సాగరి xxx రిగ xxxx ముద్రస్థాపిత యాగికో xxxxxx పడి xxxx యుంటెంకణాదిత్య సోమిశెట్టి యుం x లదం కరద కీర్తి నారాయణ సెట్టియు, గొనిసెట్టియు హెర్మాడి బూదపూర యళ బాది సెట్టియుం కొట్టి x సెట్టియు త్రైలోక్యమల్ల సెట్టియుం

విసెట్టియుం అళప్రజె నామ్మరయకు మతమా xxxx సెట్టి యుం బోనగియ దాసిసెట్టి యుంత్రిభువన మల్ల బేతినాయకునుం పాణనాయకునుం ఒళప తిమ్మనాయ కరుం మూవత్తూరుం బిడినసెట్టి కఊరుం సమస్త ప్రజయుం కూడి సాగరేశ్వర దేవర్గె సోమేశ్వర దేవర్గం అప్పురద xహన x న్నదే ౧౦౦౦ యిర హెరగి గహ ౮౧ దుగ్గి ధారాపూర్వకం మాడి xxx కొట్టిదం తిధం

స్వదత్తాం పరదత్తాం వాయో హరేతి వసుంధరాం
షష్టివర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమి
మద్వంశజాః పరమహీ పతి వంశ జావా
పాపాడ పేత మనసో భువి భూమి పాలాః

యే పాలయంతి యమధర్మ మిదం సమస్తం
తేషాం మయా విరచి తోం జలిరేష మూర్ధ్ని

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

తెలంగాణా శాసనములు భా ౧, పు 106
గంగాపుర శాసనం నెం 2

ఈ కన్నడ శాసనం చాళుక్య ప్రభువు జగదేకమల్లుని ఎనిమిదవ రాజ్య సంవత్సరం నాటిది ఈ వంశంలో జగదేకమల్లులు యిద్దరున్నారు మొదటి వాడు ఇతని కాలం క్రీ.శ 1015 - 45 రెండవవాడు ప్రతాప చక్రవర్తి - ఇతని కాలం క్రీ శ 1138-49

దీనిలో గంగాపుర స్థానికులైన కొందరు సెట్టి కులజులు మరియు ప్రజలు సాగరేశ్వరునికి సోమేశ్వరునికి కలిపి చేసిన దానాన్ని తెలుపుతుంది

సోమేశ్వరంలో గంగేశ్వర ప్రతిష్ట ఉందిగాని, గంగాపురంలో సోమేశ్వర ప్రతిష్ఠలేదు చాళుక్యుల కాలంలో గంగాపురం సోమేశ్వరం జతగా అభివృద్ధి పొందుతున్న క్షేత్రాలు అందువల్ల ఈ శాసనం గంగాపురంలో ఉన్నా దీనిలో సోమేశ్వరుడు పేర్కొనబడినాడు కాబట్టి ఇది సోమేశ్వరానికే సంబంధించి ఉంటుందని దీనిలో చేర్చినాను

# 3. సోమశిలా శాసనము

స్వస్తి మస్త భువనాశ్రయ, పృథివీ వల్లభ మహారాజాధి రాజ పరమేశ్వర పరమ భట్టారక సత్యాశ్రయ కులతిలక చాళుక్యాభరణం ''శ్రీమత్రి భువన'' మల్ల దేవర విజయ రాజ్య ముత్త రోత్తరాభి వృద్ధి ప్రవర్ధమాన మాచంద్రార్క తారంబరం సలుత్తమిరె కందుర సోమల దేవియ రెమ్మ మత్తయ్య రం-భీమరసను గంగా దేవియుం మాడిద ప్రతిష్ట గంగేశిరమ దేవర ధర్మ మాగి సహాయిసులు దెంబదు కొట్టి పొకెయ ఉప్పయణ దనొలె పదిసుళు బిండ పరయె తమ్మ ధర్మ మంకై కొడు చాళుక్య విక్రమ వర్ష ౪౧ నెయ దుర్ముఖి సంవత్సర x x శుద్ధ ౯ సోమవార దందు వమావర x పన్నెరద జోళిగ ణవడ్డి కోడూరు మహామండల నెలెయలి

ఈశెలయు మ అస్తరిక x కల్పెయుమ xx పుట్టా ఖరౌళు వసజళెయ లెరెకిసు కొడలు జాలడ లెయ్యు మం భీమ సముద్రద ౧౨ రౌత్తతుగళెయ్య మం తొండెయన కుండెయు మం ౧౫౦ గాణంగళుమని x వెల్ల మంచక్రవర్తి పెర్మాడి రాయ త్రిభువన మల్ల దేవరు సోమశిల య ప్రతి ల్లప్ప గంగేశ్వర ధూప దీప నివేద్య విద్య దానక x కంత్రి భోగాభ్యం తరమాగి వాగీశ్వర పండితర్గె వమశ్య వాగి బిట్ట

తెలం శా భా ౧. పుట 132 *గంగాపుర శాసనం* నెం 32

ఈ కన్నడ శాసనం పశ్చిమ చాళుక్య ప్రభువు ఆరవ సోమేశ్వరుని కాలం నాటిది దీని కాలం క్రీ శ 1118

ఇది కందూరు చోళ వంశానికి చెందిన భీమరస్సు భార్యయైన సోమలదేవితో గూడి సోమేశ్వరంలో గంగేశ్వరుని ప్రతిష్ఠించి అతని పూజా నైవేద్యాలకు ధూప దీపాలకు చేసిన దానాన్ని యిది తెలుపుతుంది ఈ భీమరసు సోమేశ్వరుని సామంతుడు

ఈ శాసనంలో శైవ మతాచార్యుడైన వాగీశ్వర పండితుడు పేర్కొనబడినాడు అతడు శ్రీశైల స్థానాధిపతియట భీమరసు బహుశః అతని చేతుల మీదుగా తాను చేసిన దానం ఈ దేవునికి చెల్లించి నడిచే అట్లు ఏర్పాటు చేసి ఉంటాడు

# 4. దర్గా శాసనం

తావీజ్ మజార్ సయ్యద్ కమాలుద్దీన్ దామాద్ ఇబ్రాహీం కుతుబ్‌షాహి హి 1020 క్రీ శ 1602

సయ్యద్ కమాలుద్దీన్‌కు మహమ్మద్ కులీకుతుబ్‌షానే సర్ లష్కర్ ముర్తజానగర్ గుంటూర్కే రాజావొంకే ముఖాబిలేకే లియే భేజాధా వహీ యే షహీద్ హుయే

సయద్ కమాలుద్దీన్ దర్గాపై గలలేఖనం గూడు రూపంలో మలిచిన ఫలకంపై మొదలు అరబీ యొక్క గుజిలీ వ్రాతలో అల్లాస్మరణ పిమ్మట సయ్యద్ కమాలుద్దీన్‌గారి మరణకాలం ఈ విధంగా వ్రాయబడింది

శాసనం - తెలుగు పాఠం :

''మహమ్మద్ కులీకుతుబ్‌షా అల్లుడైన కమాలుద్దీనును నాయకునిగా ముర్తజానగర్ గుంటూరు యొక్క రాజులపైకి పోరాటమునకు పంపగా నతడక్కడనే వీరమరణము పొందెను''

ఈతని సమాధి కృష్ణానదీ తీరంలోగల సోమశిలలోని మసీదు దగ్గర ఉంది

ఈ కాలం నాటికి జటప్రోలుసీమను కటారిరామనగాని లేదా అతని సోదరుడు సురభిమాధవరాయలుగాని పాలిస్తు ఉండి ఉంటారు



# ద్వాదశ జ్యోతిర్లింగాలు

| | | | |
|---|---|---|---|
| 1 | ఆంధ్ర ప్రదేశ్ | శ్రీశైలం | మల్లికార్జునం |
| 2 | బీహార్ | చితాభూమి | విద్యానాథం |
| 3 | గుజరాత్ | సౌరాష్ట్రం | సోమనాథం |
| 4 | హిమాచల్ | హిమాలయం | కేదారం |
| 5 | మధ్య ప్రదేశ్ | ఓంకారం | పరమేశ్వరం |
| 6 | మధ్య ప్రదేశ్ | అవంతి | మహాకాళం |
| 7 | మహారాష్ట్ర | ఢాకినీ | భీమశంకరం |
| 8 | మహారాష్ట్ర | దారుకావనం | నాగేశ్వరం |
| 9 | మహారాష్ట్ర | నాసిక | త్రియంబకం |
| 10 | మహారాష్ట్ర | శివాలయం | ఘృష్ణేశ్వరం |
| 11 | తమిళనాడు | సేతుబంధం | రామేశ్వరం |
| 12 | ఉత్తర ప్రదేశ్ | వారణాసి | విశ్వేశ్వరం |

ఈ జ్యోతిర్లింగాలు మధ్యప్రదేశ్‌లో రెండు, మహారాష్ట్రలో నాలుగు, ఆంధ్రప్రదేశ్ - బీహార్ - గుజరాత్ - హిమాచల్ ప్రదేశ్ - తమిళనాడు, ఉత్తర ప్రదేశ్‌లలో ఒక్కొకటి ఉన్నవి

# అష్టాదశ శక్తిపీఠాలు – పట్టిక

| | | | |
|---|---|---|---|
| 1 | ఆంధ్ర ప్రదేశ్ | అలంపురం | జోగులాంబ |
| 2 | ఆంధ్ర ప్రదేశ్ | పిఠాపురం | పురుహూతిక |
| 3 | ఆంధ్ర ప్రదేశ్ | దాక్షారామం | మాణిక్యాంబ |
| 4 | ఆంధ్ర ప్రదేశ్ | శ్రీశైలం | భ్రమరాంబ |
| 5 | అస్సాం | హరిక్షేత్రం | కామరూప |
| 6 | బీహార్ | గయ | సర్వమంగళ |
| 7 | శ్రీలంక | సిలోన్ | శాంకరి |
| 8 | గుజరాత్ | ప్రద్యుమ్నం | సింహాల |
| 9 | హిమాచల్ | జ్వాలాక్షేత్రం | వైష్ణవి |
| 10 | కాశ్మీర్ | కాశ్మీరం | సరస్వతి |
| 11. | కర్ణాటక | కంసపట్టణం | చాముండి |
| 12. | మధ్యప్రదేశ్ | ఉజ్జయిని | మహాకాళి |
| 13 | మహారాష్ట్ర | కొల్హాపూర్ | మహాలక్ష్మి |
| 14 | మహారాష్ట్ర | మాహుర్యం | ఏకవీర |
| 15 | ఒరిస్సా | ఉద్యానం | గిరిజా |
| 16. | తమిళనాడు | కంచి | కామాక్షి |
| 17 | ఉత్తర ప్రదేశ్ | ప్రయాగ | మాధవి |
| 18 | ఉత్తర ప్రదేశ్ | వారణాసి | విశాలాక్షి |

# సోమశిలలో ప్రస్తుతం జరుగవలసిన నిర్మాణాలు

ఇక్కడ జరుగవలసిన పనులలో మొదటిది రోడ్డు ఇంతవరకిది మెటల్ రోడ్డు అయింది కాని అది అంతా చిట్లుతుంది కాబట్టి అర్జంటుగా పక్కాతారు రోడ్డు కావలసి ఉంది అప్పుడే యాత్రికులకు సోమశిలయాత్ర ఆహ్లాదకరంగా ఉంటుంది

ఇక్కడి ఆలయాలలో యింకా నాలుగింటికి శిఖరాలు లేవు రెండాలయాలలో శాస్త్రీయమైన ప్రతిష్ఠగూడా లేదు 11వ రెంబలు గుడి కప్పులేక అసంపూర్ణంగానే నిలిచిపోయింది ఇవి యిక్కడికి తరలించే నాటికే అట్లా అసంపూర్ణంగా నిలిచివున్నవి వాని శిఖరాలు మరియు ఏకాదశాలయ నిర్మాణం పూర్తి చేయవలసి వుంది

అట్లాగే శాస్త్రీయమైన ప్రతిష్ఠలు లేనివానిలో తక్కిన ఆలయాల స్థాయికి సమానంగా శివప్రతిష్ఠలు నందీశ్వర ప్రతిష్ఠలు చేయించవలసిన అవసరం ఉంది

ఈ పనులన్నిటికి ఉదారస్వభావులైన భక్తులు ముందుకు రావలసివుంది యశశ్శరీరాన్ని కాంక్షించే ఏ మహానుభావులు ఈ పుణ్యాన్ని పంచుకుంటారో యిప్పటికైతె వేచి చూడవలసిందిగానే వుంది కాని ఒకప్పుడు మన దేశంలో ఇటువంటి దైవకార్యాలకు, ధర్మకార్యాలకు దాతలు కొదువలేరు కాబట్టి మన గత చరిత్ర నుండి నేటి వారు ఈ స్ఫూర్తిని పొందవలసి వుంది

ప్రభుత్వం యిక్కడ సోమేశ్వరునితో పాటు వేంకటేశ్వరాలయాన్ని గూడ పునర్నిర్మించిందికాని ఇంతవరకింకా దానిలో ప్రతిష్ఠమాట తలపెట్టలేదు ప్రభుత్వం తొందరలోనే శ్రద్ధ వహించి అందులో మూలస్వామిని ప్రతిష్ఠించి నిత్యార్చనా ప్రబంధం చేయగలదని ఆశించుదాము

ఇవిగాక యిక్కడ ఈ ఆలయ సముదాయాన్ని తరలించినపుడు శ్రీ కృష్ణ శాస్త్రి గారికిక్కడ ఆలంపూరులో వలె ఒక శిల్ప ప్రదర్శన శాల గూడ ఏర్పరచవలెనని ఉండి, దానికొరకు భవనం కూడ ఒకటి నిర్మింపజేసినారు కాని వారు సేకరించిన శిల్ప సంపద యింకా దానిలో ఉండటానికి నోచుకోలేదు ఆరుబయట అలాగే పడివుంది కాబట్టి

ప్రభుత్వం యిక్కడ శిల్ప ప్రదర్శన శాలను గూడ తొందరగానే ఏర్పాటు చేయవలసిన అవసరం ఉంది ఎందుకంటె యిక్కడ పవిత్రమైన కృష్ణానది, దానివెంట కొండలు అడవులు ఉండి ఇదొక మనోహర దృశ్యకావ్యంగా ఉంది కాబట్టి శిల్ప ప్రదర్శనశాల గూడ దీనికి తోడైతే సాంస్కృతికంగా గూడ యిది వన్నెకెక్కగలదు అందువల్ల దీన్నొక యాత్రా కేంద్రంగా గూడ చేయవలసిన అవసరం ఉంది

ఇంతవరకిక్కడ ద్వాదశ జ్యోతిర్లింగాలకు ప్రతినిధులుగా పన్నెండు శివాలయాలెటూ ఉన్నవి కాబట్టి వేంకటేశ్వరాలయం గూడ ప్రతిష్ఠ జరిగి నిత్యోత్సవంగా అలరారుతున్ననాడు యాత్రికుల కిచట తిరుపతి, కృష్ణానది తీరంగా బట్టి శ్రీశైలం రెండూ ఒకే చోట దర్శనమీయగలవు అంతే కాక యిది శివకేశవ క్షేత్రమై గంగాయమునల సంగమంవలె పవిత్రమై, శిల్ప ప్రదర్శనశాల అనే సరస్వతి దీనికి అంతరంగంగా చేరినపుడీ క్షేత్రం మళ్లీ తన పూర్వవైభవాన్ని పొంది త్రివేణి సంగమం వలె ప్రసిద్ధి నొందగలదు

ఈ నిర్మాణాలతో పాటు యిక్కడ యాత్రికులకు ఒక వసతి గృహం గూడ అవసరం అన్నదాతలెవరైనా తమ పూర్వులపేర యిక్కడ సత్రపుగదుల నిర్మాణానికి తలపెడితె మంచిది సోమేశ్వరుడు అట్టి వారికే ప్రతిఫలాన్ని ఈయకుండా ఊరుకోలేడు

''ధర్మోరక్షతి రక్షితః'' - కనుక కలియుగంలో దైవం కూడా అంతే - తనను చూచేవారిని తాను చూస్తాడు కనుక అచిరకాలంలోనే ఈ క్షేత్రం మరల పూర్వ వైభవాన్ని పొందగలదని ఆశించుదాము

